## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050018872

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
| --- | --- | --- | --- |
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
| --- | --- | --- | --- | --- | --- | --- |

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- |

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- |

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

# బాలనీతి.

ఇది

## చివుకుల అప్పయ్యశాస్త్రిచే

రచింపఁబడినది.

---

(రెండవకూర్పు 1000 ప్రతులు)

తణుకు

సౌదామినీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1914



పోస్టేజీకాక వెల. { కంపెని రు 0-8-0
హాలి 0-9-4

శ్రీశారదాంబాయైనమః.

# ఉపోద్ఘాతము.



కోవిదులారా!

ప్రస్తుతకాలమున వచనగ్రంథ నికరము కించిజ్ఞుల కెక్కువ యుపయోగకారియని ప్రాజ్ఞులు పలుకుచున్నారు కదా. తత్కారణముననె హైదరాబాదు గవర్నమెంటు హైస్కూలుసహాయాంధ్రోపాధ్యాయులగు మ॥ య॥ నరసింహశాస్త్రిగారు విద్యార్థులకు నీతియుతములగు పూర్వకథలను దృష్టాంతీకరించుచు భాషాభివృద్ధిఁ గలుగఁ జేసెడి చిన్నకబ్బ మొకదానిని రచించుడని నాకుఁ బ్రోత్సాహముఁ జేసిరి. దాని నేనంగీకరించి భారత భాగవత రామాయణాదులనుండి కథలను గైకొని సంగ్రహముగా వ్రాయుచుఁ బ్రస్తుతమున ముప్పదివిషయములను వ్రాసితిని. కాన విచక్షణులగు మీరీగ్రంథమును దయతోఁ బరిశీలించి విద్యార్థులకు, మఱియు సామాన్యుల కుపయోగ పడునటులఁ జేయవలయునని ప్రార్థించెద.

నేను ముద్రాక్షరశాలకు మిక్కిలి దూరగుఁడనగుటచేత దీనిని ముద్రించుటయందుఁ జాలతప్పులు దొరలినవి. వానిలో ముఖ్యములైనతప్పులను దిద్ది యింకొకచో ముద్రించి యున్నాను. ఇంకను రేఫశకటరేఫస్థాను స్వరాదివ్యత్యయము

లు మెండుగాఁ గలవు. వానినన్నిటిని దిద్దుకొనవలసిన భారము వారియందె యుంచితిని. ఇందుమన సంస్కృతాంధ్రారోగ్యవిషయముల గుఱించి వ్రాయుచుఁ గవికాలాదులఁ దెలియఁ బఱచియున్నారు. అవియె సిద్ధాంతములని వ్రాయలేదు. నాకీగ్రంథమును రచింపుఁడని ప్రోత్సహించిన వారికి, నాకబ్బమునకుఁ దోడ్పడిన పూర్వాధునిక గ్రంథకర్తలకు, సచ్ఛ్రేయోభిలాషులగు మిత్త్రవరులకుఁ గృతజ్ఞతాపూర్వక వందనము లాచరించుచు నాయుపోద్ఘాతమును ముగించుచున్నాను.

కం॥ తప్పుల నొప్పుల నెఱుఁగక
యెప్పగిదినొ చెప్పినాఁడ నిందలితప్పుల్ ।
దప్పక మన్నించుచు మీ
రొప్పులెగ్రహియించవిూకు నొరిగల్ జేతుఁ॥

8—1—1911
సికిందరాబాదు

బుధజన విధేయుఁడు
చివుకుల అప్పయ్యశాస్త్రి.



# విషయసూచిక.



—:o:—

# తప్పొప్పుల పట్టి

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 1 | భగద్భ | భగవద్భ |
| 3 | 18 | విధవివిధ | వివిధవిధ |
| 11 | 19 | రాజ | రాజ్య |
| 17 | 10 | పత్రి | ప్రితి |
| 19 | 22 | బితా | బ్రితా |
| 30 | 21 | చుంటి | చుండి |
| 34 | 8 | సంత్య | సత్యం |
| 36 | 4 | యేమియు | మేమియు |
| 38 | 5 | తాను | దాను |
| 38 | 5 | లును | లను |
| 58 | 18 | తెల | తెలి |
| 58 | 19 | సురలు | సురులు |
| 59 | 15 | రో్యము | రోగ్యము |
| 63 | 8 | ఏకశిలానగరము | ఏకచక్రపురము |
| 64 | 16 | పాటి | పాడి |
| 64 | 18 | మాటుని | మాటు |
| 77 | 1 | కవు | వవు |
| 78 | 6 | లైవ | లైన |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 90 | 1 | ఆమూ | అమూ |
| 91 | 4 | వాతో | వానితో |
| 96 | 17 | బరసు | బరశు |
| 99 | 7 | తారతా | తారత |
| 101 | 15 | భాధిం | బాధిం |
| 112 | 22 | ఇదియు | దీనిని విడువవలెను |
| 113 | 6 | యంత్రి | యంతి |
| 123 | 1 | బ్రతిజ్ఞలు | బ్రతిజ్ఞల |
| 128 | 11 | చిక్కించుటకై | చిక్కించుకొనుటకై |
| 128 | 5 | గర్హ | గర్హ్యాంశ |
| 135 | 19 | సంభావ | సంభావరించు |
| 137 | 16 | త్రమిది | త్రమమిది |
| 139 | 15 | ర్భో | భ్రో |
| 146 | 22 | మాలము | మూలము |
| 154 | 10 | హుళక్కి | హాళక్కి |
| 158 | 16 | (పణీత | ప్రణీత |

మరియు 6 పుట 13 వ పంక్తిలో "మొదలు" అయిన తరువాత వానిని దొలగించవలెను. తొలగించిన అనుదానిని చేర్చుకొనవలెను. 9వ పుట 6వ పంక్తిలోనుండు "సంభవించుటయు" అను పదమైనతరువాత "గలిగినవి. ఇవియు" అను దానిని చేర్చుకొనవలెను.

ముఖ్యములగు తప్పులుమాత్రము దిద్దబడినవి. కానపాఠకులు మిగిలినతప్పుల సవరించుకొనుచు జదువ బ్రార్థితులు.



ఇచట నీగ్రంథప్రాశస్త్యమునుగురించి యొకరి యభిప్రాయము మాత్రము ముద్రింపించుచున్నాను.

కింకవి ఘటాపంచానన నేత్యాది బిరుదాంచితులును, ఆధునికాంధ్రలోకైకవిద్వత్కవీశ్వరులును, సద్విమర్శకులును, నిరుపమానశతావధాన చతురులునగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిల వారీక్రిందవిధమున మచిలీపట్టణమునుండి వ్రాయుచున్నారు.

అయ్యా!

"మీపుస్తకము నామూలాగ్రముగా జూచితిని. ఇప్పుడు స్కూళ్లలో "కంపోజిషన్" వ్రాయనలవాటు చేసికొను బాలుర కిది కల్పలతవంటిదని నాయభిప్రాయము. మరియు నిందున నీతులు ధర్మములులోనగునవికూడ నున్నవి. గనుక నితరులగు చదువరులుకూడ నెక్కుడుగ నాదరింతురని నానిశ్చయము.

—:o:—

శ్రీశారదాంబాయైనమః.

# బాలనీతి.

## భగవద్భక్తి.

భగవద్భక్తియనన భగవంతునిసేవించుట, లేక, యాతని నమ్మియుండుటయే. భగవంతుఁడనన శ్రీ వీర్యము. ఇచ్ఛ, జ్ఞానము, వైరాగ్యము, కీర్తి, యను నీమహాసుగుణములతోఁ గూడికొనినవాఁడు. ఆతనిని నమ్మియుండుటయే భగవద్భక్తి యనఁబడు.

ఈభగవద్భక్తిగలిగినవారలు భాగవతులనఁదగుదురు. వీరికిఁ గ్రమముగా నాశనములేనిపదవి లభింపఁగలదు. ముముక్షులకు భక్తిమార్గము మొదటిసాధనము. ఈభాగవతులకు సర్వకార్యములుసిద్ధియగుచుండును. కీడులుమూఁడవు, మేలుఁ బొసఁగును. సద్బుద్ధిసంభవించును. దుర్బుద్ధి యడుగంటును. మనము నిశ్చలమగుచుండును. మనమెందులకాభగవంతునియందు భక్తికలవారముగానుండవలెనన? ఆదయామయుఁడు సర్వభూతములందును దయగలవాఁడై వానికిఁదగినటుల నాహారాదులనొసంగి సర్వకాలములందును వానిని బాధలఁ బొందకుండఁ జేయుటవలనను, మనకుఁగష్టములు సంభవించిన సమయంబునం దామహామహుని ధ్యానించినయెడలఁ దత్కా-

లమందనుభవించెడిసిలువులఁ బాపి సుకముఁ జేకూర్చుటను, మఱియు నాయన, మనబాయుడవలెఁ దినుటకన్నమును, గట్టుటకు బట్టలును నిచ్చి యల్లారుముద్దుగాఁ గాపాడుటను, మన మే పనిని బ్రారంభించినను దానికనేకవిధముల సాయముఁజేసి సఫలముగా నొనరించుటచేతను, మనకు జగమునను౦డువస్తువుల నెల్లఁ జూచుటకుఁ గన్నులును, నడచుటకుఁ గాళ్ళును, గర్మములనారంభించుటకుఁ గరములును, విమర్శన మొనరించుటకు బుద్ధియును, గీర్తించుటకు వాక్కును, మఱియు బహువిధోపయోగంబులగు బహ్వవయవముల నిచ్చుటవలనను, నాపరమదయాళునిఁ దప్పక సేవించవలెను.

మనమాభగవంతుని సేవించుటయెట్లన? మనము ప్రతిదినముఁ దెల్లవాఱుజామున నాలుగుగంటలకు మేల్కాంచి దంతధావనాది కృత్యంబుల నిర్వర్తించుకొని విమలజలమున స్నానమాచరించి ముఱికిలేని బట్టలఁగట్టి శుచికలవారమై "చిత్తము శివునిమీఁద భక్తిమఱియెచ్చటనో"యన్నట్లుండక మన మనస్సును వాక్కును, శరీరమును, గర్మమును, నీనాలుగు నొకచోఁజేర్చి సంభవస్థితిలయహేతు భూతుఁడగు నప్పరమేశుని, "నేఁ దెలియక చేసినపాపపుఁబనులను, దెలిసియుఁ జేసినపాపపుఁబనులను నా మొఱనాలకించి నన్ను మన్ననతో మన్నించవలయు" నని కోరి ధ్యానించవలెను. మఱియుఁ బూజాదుల నాపరమాత్ముని సేవింపవలెను. మనము భక్తిలేక యెంతగొప్పగాఁ బూజఁజేసినను బ్రయోజనము లేదు. "భక్తి

లేనిపూజ పత్రిచేటను సామెత వినలేదా? కాబట్టి మనము చేయుపూజను నిశ్చలభక్తితోఁ జేయవలెను.

అంతట దుష్టులను శిక్షించువాఁడును, శిష్టులరక్షించువాఁడును నగు నాపరమేశ్వరుఁడు మనమొఱ తెలుఁగునెఱింగి మనము చేయు సేవకు మెచ్చి మన మనోభీష్టముల నెఱవేర్చి మన సుఖదుఃఖముల నారసి మొగ్గులున్నఁ దగ్గించి లగ్గులున్న నెక్కువఁజేసి మనకుఁదోడునీడై సదా తిరుగుచుఁ గాపాడుచుండును. మనము భగవద్భక్తిఁ గలిగియున్నయెడల మనశత్రువులు మనలఁ జిక్కులఁబెట్టఁదలఁచిన నవి యెంతమాత్రమును మనలను బాధింపఁ జాలవు.

ఈభక్తివిషయమునఁ బ్రసిద్ధికెక్కినవారలు పూర్వులలోఁ జాలమంది కలరు. వారిలో నొకనినిఁ జెప్పెదను.

హిరణ్యకశిపునకుఁ గుమారుఁడగు ప్రహ్లాదుఁడు, తన తండ్రికి మిక్కిలిశత్రువును, భగవదవతారమునగు విష్ణునందు భక్తికలవాఁడై యుండెను. ఇట్లుండుట యతనితండ్రి చూచి వింతనంది తనకొమరున కనేకవిధంబుల "నాతనియందు భక్తి మాను"మని చాలసారులు చెప్పెను. కాని యాపిల్లవాఁడు వినకపోయెను. అంతటఁ దండ్రి తనకొమరుని వివిధహింసలఁ బెట్టెను. ఇతరులచేఁ బెట్టించెను. కాని యాప్రహ్లాదుఁడు మాత్రమించుకైన బాధనుబొందలేదు. అత్తఱి నాప్రహ్లాదు తండ్రి "ఏమిదిచోద్యము ఎన్నివిధములవేధించినను నీతనయుఁ డాబాధలఁబొందక యున్నాఁడె వానినెక్కుడుగాస్తుతించు

చున్నాఁ" డని యిదివఱకుండుకోపమును రెండు రెట్లధికముఁ జేసికొనియుఁ జేయునదేమియులేక విసివి యాబాలునిఁ జూచి "కొడుకా! నీవెప్పుడు కనులకుఁ గనుపడనివానినిఁ గొనియాడు చుందువు. వాఁడెక్కడనున్నాఁ"డని యడిగెను. అంతనాభక్త శిరోమణి "సర్వశక్తిసంపన్నుఁడగు నాదానవవైరి ప్రతిపదార్థ మునందును, ప్రతిమనుజునందును గలఁ"డని పలికెను. అంత నా హిరణ్యకశిపుఁ "డటులైన నాచక్రిని గ్రక్కున నీకంబమునం దుఁజూపుము లేదా నీశిరంబిప్పుడే భూతబలిం జేసెద" నని వాక్రుచ్చెను. అంతట భాగవతశిఖామణియగు ప్రహ్లాదుఁ డాపరమాత్మను నిశ్చలభక్తితో ధ్యానింప నాపరమేశ్వరుఁడు తనభక్తుని కోరికఁదీర్పుటకై తనశరీరముయొక్క క్రింది సగ మున మనుజాకారమును, పైసగమున సింహాకారమును, దా ల్చి "నృసింహమూర్తి"యను పేరునఁ గంబమునుండి బయలు వెడలి జగదేకవీరుఁడై తనభక్తునిఁ బలుతెఱఁగుల బాములఁ బెట్టినవాఁడును, లోకకంటకుఁడునునగు నాహిరణ్యకశిపుని సంహరించి దేవాదులచే సన్నుతిఁగొని భక్తునిఁగాపాడి యంత ర్థానమయ్యెను.

చూచితిరా! ఆప్రహ్లాదుఁడు భక్తివలనఁగాదె తనజ నకుఁడు పెట్టినబాధలఁ బొందకపోవుటయ కాక దుర్లభంబగు పరమాత్ముని దివ్యరూపముఁ గాంచఁగలిగెను. కాఁబట్టియె యిప్పటికిఁ బ్రహ్లాదుఁ డవిచ్ఛిన్నమగు కీర్తిఁ బడయుచున్నాఁ డుకదా!. కాన మనమందఱము భగవద్భక్తి కలిగియుండుట

కైక్కువగాఁ బ్రియత్నముఁజేసి భాగవతులని వ్రాసిఁగాంచవలెను.

ఆ. వె. ఎన్ని యెన్ని పూజ • లెన్ని జేసిన నేమి
భక్తి లేనిపూజ • ఫలము లేదు
భక్తిగలుగుపూజ • బహుళ కారణముగా
విశ్వదాభిరామ • వినుర వేమ!

# మాతృభక్తి.

తల్లియందు భక్తిగానుండుటయే మాతృభక్తి యనంబడు.

మనతల్లి మనలను బదిమాసములు మోసి పలుబాధలకోర్చి వచించరానికష్టములఁబడి కనును. కనినది మొదలు మనయొక్క మూత్రపురీషాదులను గడిగి బహుజాగ్రతతో మనలఁ గాపాడుచుండును. మనప్రాణములను దమయరచేతిలో నిడుకొనిపోషించుచుండును. మనలను గ్రిందుగ విడిచినఁ జిల్లిమిర్రిగునయనియుఁ, బైనిఁ బెట్టినఁ బక్షి తన్నుకొనిపోవునని యు బెంగపడుచుఁ బ్రీతితోఁ బెంచుచుండును. మనలను మనకన్నతండ్రి యసహ్యించుకొనినను గన్నతల్లి మాత్రమటు లసహ్యించుకొనక దగ్గఱకుఁదీసికొని తనయొడిలోఁ గూర్చుండఁబెట్టికొని బుజ్జగించుచు ముద్దులాడు చుండును. మనవలన నెట్టినటితప్పులువచ్చినను భరించునది తల్లియే

కాని వేఱొకరుగాన రారు. మనకెట్టియిక్కట్టులు వచ్చినను సవితొలఁగు నుపాయమాలోచించి చేతనయినంతవఱకు వానినిఁదొలఁగించుచుండును. "పిల్లి తనపిల్లల నెక్కడ నెప్పుడు గండుపిల్లివచ్చి చంపునో" యనుభయముచే సందులగొందుల వానిని దాచిపెట్టుట మనము చూచుటలేదా? కాఁబట్టి తల్లికున్నప్రేమ యితరులకు లేదనిచెప్పవచ్చును. అట్టితల్లుల యందు భక్తిగానుండుట మనకు విధ్యుక్తధర్మము కాదా. అదిగాక "మాతృదేవోభవ" అనఁగాఁ "దల్లియేదైవముకలవాఁడవై కమ్ము" యని యుపనిషత్తులు చాటుచున్నవి. మఱియు "నమాతుః పరదైవత" మ్మనఁగాఁ "దల్లికంటె నితరదైవములేదని శాస్త్రము నుడువుచున్నది. కాన మనలను వృద్ధికిఁదీసికొనివచ్చిన తల్లులయందు భక్తిగానుండవలెను. వారికేవిధమైన బాధలుండినయెడల ననుకొనని ప్రయోజనములను హఠాత్తుగాఁ బొందఁగలము.

అటుల మాతృభక్తికలిగి యాకస్మికముగా లాభములఁబొందినవారును బూర్వులలోఁ గలరు. వారిలోనొకనిఁ జెప్పెద.

మున్ను కశ్యపబ్రహ్మవరమున "వినత" యను తరుణీరత్నమునకు గరుడుఁడనువాఁడొకఁడు జనించెను. ఆతఁడు మహాజవ సత్త్వసంపన్నుఁడు. అట్టియా నాగరుత్మంతుఁడు తనతల్లియనుమతిని, దనసవతితల్లియగు కద్రువయొక్క కుమారులగు పాములను మోయుచుండెను. ఇటులుండ నాతని

వీపుననుండి యొకపరి యవి క్రిందఁబడుట కడు ప్రకాశించె.
అంత నామె యత్యంతముగా నాగరుఁడుని దూఱెను. అంత
నాతఁడు తనతల్లిని "అమ్మా! మీసవతియొక్కయు, నామె
కుమారులయొక్కయుఁ బనులనెందులకుఁ జేయవలె"నని యడి
గెను. అంతనావినత "నాయనా! నాసవతియు నేను నుచ్చైశ్శ్ర
వంబుఁ బరీక్షించునపుడు దానిపుచ్ఛంబున నలుపు లేదని నే
నును, గలదని యామెయును వాదమొనరించితిమి. ఈవాద
మున నెవరోటువడుదురో వారవతలివారికి దాసిగానుండవలె
నని యొక పంతమేర్పఱచుకొంటిమి. మఱునాఁడు దానిఁబరి
శీలింప నేనోటువడితిని. దాన నామెకు దాసిగా నింతవఱకు
నుంటిని. దీనికిఁ గారణము మీయన్నగారగు ననూరునిశాపమే
ఇఁక నీబానిసపని నీవలనఁబాయఁదగు"నని పలికెను. అంత
నతఁడు తనతల్లియొక్క నీచపుదశఁ గనుఁగొని వంతనంది
యా వరవుడముం బాపుటకై యాసవతితల్లికొమరులదరిఁ జే
రెను. తరువాత, వారిని "నాతల్లిదాస్యము మీరు బాపినయెడ
ల మీకిష్టమైనది యేదైనను దెచ్చియిచ్చెద"నని యడిగెను.
అంత వారు "మాకమృతంబుఁ దెచ్చియిచ్చిన నీతల్లిదాస్యము
పాయఁగల"దని యనిరి. దానికి గరుడుఁడు సమ్మతించి తన
తల్లియనుమతినిఁ గైకొని మార్గమధ్యమున ననేకదుష్కర
కార్యములఁ జేయుచు నాకలోకంబుఁ జేరెను. అచట నమృ
తమును గాచుచుఁ గావలియున్నవారితో యుద్ధమొనరించి
యాయమృతమును గైకొని తానుఁదాగకుండ నత్కృతదు

వేగముతో వచ్చుచుండెను. ఇంతలో విష్ణుమూర్తి కనుఁగొని "నీవేగసమృద్ధులకును, నీబలమునకును, నీమాతృభక్తికిని మెచ్చితిఁ గాన నీకుఁ గావలయువరములెవ్వియో కోరు" మని పలికె. అంత నావైనతేయుఁడు "భక్తవత్సలా! నేనమృతం బుఁద్రాగకపోయినను ముసలితనములేని దేవత్వమును, నీభువనములకెల్లను నాయకుఁడవైన నిన్నునెల్లప్పుడుఁ గొలిచి యుండుటను నాకుదయచేసి యనుగ్రహించుఁ"డని ప్రార్థించెను. అంత నామహామహుఁ"డటులనె నీకోరికలిచ్చితి. మఱియు నీదినమునుండి నాకుధ్వజమును వాహనంబును, నీవె కావలయు"నని చెప్పెను. దానికాగరుత్మంతుఁ డంగీకరించి సంతసించెను. ఇంతలో దేవేంద్రుఁడు "అమృతమును వీఁడు హరించెఁగా" యని కినిసి యాగరుడునిపై వజ్రాయుధమును బ్రయోగించెను. అంత నాయాయుధము క్రమముగా నాగరుడునిఱెక్కలను భేదించరాఁగా నాతఁ డాయాయుధముం గాంచి "వజ్రాయుధమా! గొప్పవాఁడగు దేవేంద్రునికరమునందుండుదానవు. కాన నిన్నవమానింపఁగూడ" దని పలికి తనఱెక్కయందున నొకయీఁకమాత్రము దానికాహారముగాఁ జూపి నీపనినిఁజేసికొనుమని పలికెను. ఇవ్విధమున నీగరుత్మంతుఁ డొనర్చుట సురేశ్వరుఁడు చూచి మెచ్చి యాతనితో స్నేహముఁజేసికొనెను. అటుపిమ్మట నావిహంగపతి కాద్రవేయుల సమీపమునకువచ్చి "ఇదిగో మీరుకోరినటుల నమృతమునుదెచ్చినాను. గొనుఁడు.నాతల్లిని దాస్యంబునుండి

విడిపింపు" మని పలికెను. అవ్విధముననే వారొనరించిరి.

చూచితిరా! ఆవిహంగేంద్రుఁడు మహాబలజవోపేతుఁడయ్యుఁ దల్లిమాటనిరాకరించలేక పాములమోసెనుగదా. మఱియుఁ దనతల్లి దాసీపనిఁ బాపుటకై యెంతపనిఁ జేసెనో తెలిసినదిగదా. ఈసమయముననేకదా విష్ణుమూర్తివలన వరములఁబొందుటయు నింద్రునితో సఖ్యంబు సంభవించుటయు మాతృభక్తివలన నాకస్మికముగా వచ్చినలాభము లేకదా. కాఁబట్టి మాతృభక్తిగలిగినవారలు మహాసంపన్నులు కాఁగలరు. కాన మనము మాతృభక్తికలిగియుండుదము.

ఆ. వె. వచ్చిపోయి చూచు • వాఁడుగాకిడుమలఁ
బడునె? తల్లివోలెఁ • బట్టికోడఁ
దంచి? చెప్పునిట్లు • ధర్మశాస్త్రంబుల
నంబ గౌరవమున • నధిక యగుట.

(భారతము)

## పితృభక్తి.

తండ్రియందు భక్తిగానుండుట పితృభక్తి యనఁబడు. కన్నతండ్రి మనలఁ బెంచి పెద్దఁజేయును. మనకుఁ గావలసినయాహారవిహారపదార్థముల యథాశక్తిఁ దెచ్చియిచ్చును. మనతోఁగూడ నాడుచు మాటలాడుచు మనకానందముఁ గూర్చుచుండును. మనతోడనే స్నేహముగాఁగొల

ముఁగడపుచుండును. మనకుఁ దండ్రియే, తపమును, విద్యయును, ధర్మమును, బరమాత్మయునుగానఁ గొమరులమగు మనము వారిని వివిధముల సంతోషింపఁజేయుచుండవలెను.

మనము మనతండ్రియందంతగా నెందులకుండవలెనని న? మన జనకుఁ డెల్లప్పుడు మనయభివృద్ధికై యనేకరీతులఁ బాటుపడుచుండును. విశేషలాభకారియగువిద్యనుబొందించుచుండును. "సర్వత్రజయమన్విచ్ఛేత్పుత్రాదిచ్ఛేత్పరాజయం" అనగాఁ "దఁడి యంతట జయముఁగోరవలయును.తనకుమారునివలనఁ బరాజయమొందఁగోరవలయు" ననునీతివాక్యానుసారముగా మనతండ్రియుండుటను, మఱియు" గొమరులుపుట్టి తమకేమో యుద్ధరింత్రివ్వి తలకెత్తెద"రను నాశతోనుండుటను వారియం దెక్కువభక్తిగా నుండవలెను.

"పితృదేవోభవ" అనఁగాఁ"దండ్రియే దైవముకలవాఁడవైకమూర్తి"యని యుపనిషత్తులు చెప్పుచున్నవి.ఎవఁడు తనతండ్రిని మంచిమాటలచేతను, మంచిపనులచేతను, సంతోషింపఁజేయుచున్నాఁడో వాఁడే సుపుత్రుఁడు. ఇటువంటి సద్గుణగణఖనియగు నొకపుత్రుఁడున్నఁజాలును. దుర్మార్గులు పదిమందియున్నను నిష్ప్రయోజనము. మఱియుఁ గులనాశకులనిచెప్పవచ్చు. వియత్పథమును బ్రకాశింపఁజేయుటకు సకలకళాపరిపూర్ణుండగు నొకచంద్రుఁడున్నఁజాలఁడా? కాంతివిహీనములగు పెక్కుచుక్కలేల? కాఁబట్టి కులముసుద్ధరించుటకొకసుపుత్రుఁడున్నఁ జాలు.ఈసుపుత్రునివలనఁదండ్రి యమిత

ష్టుగా సంతోషమందుచుండును. తండ్రియందు భక్తికలవాఁడై యాతనిని సంతసమందించినవాఁడే కుమారుఁడు. తక్కినకుమారులు జనకమారకులని చెప్పవచ్చు. జనకహస్తప్రదాతయగుకుమారుఁడనేకలాభములఁ బొందఁగలఁడు.

అటుల పితృభక్తిగలిగి లాభములఁ బొందినవారలలో నొకనిని జూపెద.

భారతవీరశ్రేష్ఠుఁడని వాసిఁగాంచిన గాంగేయుఁడు తనతండ్రియందు భక్తిగలవాఁడై యుండెను. ఇట్లుండ నొకపరి తనతండ్రియగు శంతనమహారాజునకు దాశరాజపుత్రికయగు యోజనగంధిపై మోహముజనించెను. అతఁడామెను వివాహమాడుటకు దానితండ్రి కడకుఁ జని తన మనోరథముఁ దెలియఁబలికెను. అంత నాదాశరాజు "జీపిల్లకు జనించిన పిల్లనికి నీరాష్ట్రమంతయుఁ బట్టముఁగట్టి నట్లొడంబడితివేని నొసఁగెద"నని పలికెను. అంతనామహారాజు తనపెద్దకుమారుఁదలఁచి మిన్నకుండి యింటికిఁజేరి డెందమునఁగుందుచుండెను. ఇవ్విధమునఁ దనతండ్రి యుండుట నొకనయమునఁగాంచి యతని యాంతరంగికమిత్రులను విచారించి కారణముదెలిసికొనెను. అంతఁ దానాదాశరాజుదరి కరిగి "నీకోరినయట్లె యీసతికి జనించిన కుమారుఁడు రాజధురంధరుఁడు కాఁగలఁడు. ఇందుకుసందియమందనవసరములేదు. వైశమెనం తరశికి నీకొమరితె నిచ్చి వివాహంబొనర్పుము. నాతండ్రి చింతవిడనాడి సుఖముగానుండుటయే నాకుఁ బ్రధానముకాన

నిమగో బ్రహ్మచర్యంబుఁబూనితి” వనిదృఢ ప్రతిజ్ఞఁజేయ నా తనిపై నాకసమున నుండి దేవతలు పుష్ప వృష్టిఁ గురిపించిరి. అంతట దాశరాజు నాతని పితృభక్తికి మెచ్చుచుఁ దన కూఁతును శంతనునకిచ్చి వివాహం బొనర్చెను. అంత నాశంతన మహారాజు తనకుమారుని ప్రతిజ్ఞకును, సద్బుద్ధికిని, భక్తికిని, సనంశముగానద్భుతమంది మదిసిమెచ్చి యూతనికి స్వచ్ఛంద మరణమును బ్రసాదించెను.

చూచితిరా! ఆ భీష్మాచార్యులు పితృభక్తి కలవాఁడగుటచేతనేకదా బాణములవలనఁగాని కత్తులవలనఁగానిమఱియొకదానిచేఁగాని మృతిఁజెందక తనయిష్టమువచ్చినపుడు విధివశమగు పదమును బొందఁగలిగెను. అట్టివరముల నితరులు పొందఁగలరా? పొందలేరు. కాఁబట్టి పితృభక్తి గలిగినవారలు పెక్కుఫలములఁబొందఁగలరు. కాన మనము మనతండ్రి మొదలగు పూజ్యులయందు భక్తిగా నుందుదము.

క. జనకుఁడు దపమును ధర్మం
బును విద్యయుఁబరమదైవమును గావున నా
తనికిఁబ్రియంబగుపనిసే
సినదేవతలెల్లఁబ్రీతిఁజెందుట గలుగున్.

(భారతము.)

# గురుభక్తి.

అజ్ఞానము నరికట్టువాఁడు, శ్రేష్ఠుఁడు, తనకు విద్యఁ జెప్పినవాఁడు, వీరలయందు భక్తిగా నుండుటయే గురుభక్తి యనఁబడు.

మనల మొందభివృద్ధికిఁ దీసికొనివచ్చునదియు, భక్తి భుక్తి శక్తి ముక్తులనొసంగునదియు, గౌరవార్హమును నగు విద్యను నిష్కపటముగాఁ జెప్పినవారలు గురువులు. కాన వారియందు మనము భక్తిగా నుండవలెను. ఆవిద్యాదాతలను మన జీవితాంతము వఱకు గౌరవించుచుండవలెను. గురువుకూడ మన తలిదండ్రులతో సమానుఁడని చెప్పనొప్పు. ఏలయన? మన జననీజనకులు శరీరపోషణాదులయందెక్కువ శ్రద్ధవహించుచుందురు. ఇఁక గురువులన్ననో మనల నితరులచే గౌరవింపఁజేయు విద్య సఱమఱలేక యఱిముఱిగా నొసంగుచుందురు. అటులనుండుటవలన వారు మనకు గౌరవస్థానమే కదా. వారు మనము విద్వాంసులమగుటకుఁ గోరుచుందురు. మనకుశలమును వారభిలషించుచుందురు. కాఁబట్టి మనమారంభదశనుండి గురుశిక్షఁ బొందవలెను. దానివలన మనము విద్య లెస్సగా నేర్చి విద్వాంసులమై లోకమున నెఱదెగనికీర్తిఁ గడింపఁగలుగుదుము. ఈ యవనియందుద్భవించిన ప్రతిమనుజుఁడును చిన్నతనముననే గురుశిక్షఁ బొందినయెడల వాఁడు సకలలాభములఁ బొందఁగలఁడు.

సద్గురుశిక్షఁబొందక చిన్నతనమును వ్యర్థముగాఁ గడపినయె డల వానికి లెక్కలేని చెడుగుణము లలవడును. పొట్లతీఁగ లయందుఁ దగులుకొనియున్న చిన్నకాయలతుదను రాలను గట్టినియెడల నవి వంకరలు పోక యెటులుండును. కాఁపరిసుం చక గొబ్బియలనుంచిన నవి వంకరఁగ్రొవలఁబడక యెటులఁజ క్కఁగాఁబోవును? కాఁబట్టి గురుశిక్షఁబొందనివారలు విశేష వక్రమార్గములఁ జొరఁబడుదురు. కానఁబ్రతివాఁడును గురుశి క్షఁబొందవలెను. విద్యనెక్కుడగా గడించవలెను.

తాము బాల్యమున నొకగురువువద్ద విద్యనభ్యసించి క్రమక్రమముగానతనియెడ ద్వేషమువహించి "నీకు మేము శిష్యులముకాము. నీవు మాకుఁజెప్పినదేదియును లేదు" అనియాః గురువుతో గుద్దులాడి యాయనకుఁ బంగనామమిడి యత నిఁదిరస్కరించుట నరకహేతువు. ఇటులొనర్చువార లవినీతులు కానఁ బ్రతివాఁడును గురువునం దెక్కువభక్తి కలిగియుండవ లెను. గురువేబ్రహ్మ, గురువేవిష్ణువు, గురువేమహేశ్వరుఁడని మనపెద్దలు చెప్పుదురు. అటులనే "ఆచార్యదేవోభవ" అనఁ గా "గురువే దైవముకలవాఁడవై కమ్ము" యని యుపనిషత్తు లనుచున్నవి. కాన మనము గురుభక్తికలిగియుండినయెడల ననేక ప్రయోజనముల నందఁగలము.

అటులఁ బ్రయోజనములందినవారలలో నొకనినిఁ

ద్రోణాచార్యులను నొకసుప్రసిద్ధ ధనురాచార్యుఁడు ధృతరాష్ట్రపాండు నందనులకుఁ జక్కగా ధనుర్విద్యాదులను జెప్పెను. అంత నాధార్తరాష్ట్ర పాండవేయులు, గురువుదగ్గఱకు వచ్చి "స్వామీ! మేము మీకు గురుదక్షిణ నీయదలఁచితిమి. కానఁ దమకేది యిష్టమో తెలియఁగోరెదము," అని పల్కిరి అంతట నాగురువు "ధాత్రీచూడామణులారా! మీబుద్ధికి మెచ్చితి. ఇదిగో నాకోరిక వినుఁడు. పాంచాలదేశాధీశుఁడును, మిత్రపరాభవకారియు నగు ద్రుపదునిఁ బట్టుకొని పాశములచేఁ గట్టి మీయరదమునఁ బెట్టికొనివచ్చి నాముందఱఁ బెట్టుటయే నాకు గురుదక్షిణ. ఇటులఁ జేసినవాఁడే గురుభక్తి కలవాఁ"డని పలికెను. దానికి వారందఱు వల్లెయని మహోత్సాహంబుతో నాద్రుపదుపురంబునకుఁ జనిరి. అందున మొదట దుర్యోధనాదులహమహమికచే నట్టిప్రయత్నముఁ జేసిరి కాని వారాపాంచాలపతితనయాదులచే నోటువడి స్వగృహాభిముఖులైరి. అంతటఁ బాండవమధ్యముండగు నర్జునుండు ధైర్యస్థైర్యములు కలవాఁడై తాఁ జేయుప్రయత్నమున కడ్డువచ్చినవారందఱినిఁ దుక్కుదూళిగఁ గొట్టి యాద్రుపదుని గట్టిగఁ గట్టి తనరథమున నిడుకొని వాయువేగమునఁ దన యొజ్జయెదుటికిఁ దీసికొనివచ్చి "ఇదిగో యితఁడే ద్రుపదుఁ"డని యచట నునిచెను. అంత నాగురు వానవ్యసాచియొక్క బాహుబలమునకును, దనయందుండు భక్తికిని మెచ్చి యెక్కుడ

గా నాశీర్వదించెను. ఈశ్వడి, గురుభక్తిఁజూపుట యీనవి యముసందే కాక యుత్తర గోగ్రహణమందుఁగూడఁ జూపెను. ఆయర్జునుఁ డుత్తరకుమారునికి "బృహన్నల" యనుమాఱు పేరితో సారథ్యంబు సల్పుచుఁ గారణాంతరమునఁ గ్రమముగాఁ దాను రథికుఁడై గాండీవాదుల ధరించి యదివఱకుఁ బ్రచ్ఛన్న వేషంబుతో విరటుని కొలువునందుండుటం బట్టి ప్రతి పక్షకోటిలోనున్న గురువరునకు నమస్కారంబుఁ జేయుటకు వీలులేక నమస్కార సూచక బాణంబుల నాగురు వరుని పాదారవిందములవంకఁ బ్రయోగించెను. అందులకాగురుఁ డమితముగా సంతోషించెను. దాన నీకిరీటి యాయుత్తరగోగ్రహణమందు జయంబత్యద్భుతంబుగా నందెను. మఱియు నీగురుభక్తివలనఁ గలిగిన నీధనంజయుని మహిమ మఱియొకండు కలదు. అది వినుఁడు. భారతయుద్ధావసానంబునఁ బుత్రఘాతియు, ద్రోణాచార్య తనూభవుండును, నగు నశ్వత్థామకు నీయర్జునునకుఁ గలహాము సంభవించెను. క్రమక్రమముగ నాకలహాము ప్రబలి యొక్కరిపై నొకరు బ్రహ్మశిరోనామ కాస్త్రంబులఁ బ్రయోగించుకొనిరి. అంత నక్కడనుండు మహామునులెల్ల నీకల్లోలమునుగాంచి వీరిఁజేరి "మీయస్త్రంబులు బ్రహ్మశిరోనామకంబులు లోకంబుల దహింపఁగలవు. కాన మీ మీయస్త్రంబుల నుపసంహరింపుఁ"డని పలికిరి. అంత వారియనుమతిని నర్జునుఁడుమాత్రము తనయస్త్రము నుపసంహరించెను. అట్టులైన నశ్వత్థామ తనయస్త్రము నుపసంహరింపలేక తన మాఱ

మున "నాకన్న నీ యెక్కువ గురుభక్తి కలవాఁడగుటచేతన నాయస్త్రము నుపహరింపఁగలిగెను. నేనాధనురాచార్యుని పుత్రుఁడనయ్యు నంతగురుభక్తి లేకపోవుటవలనఁగదా యుపసంహరింపఁ జాలనైతి,, నని యుండెను.

తిలకించితిరా! ఆయర్జునుఁడు గురువువద్దవిద్యాభ్యాసించి క్రమముగాఁ దనకన్న నెక్కుడు బలవంతుఁడయ్యె నాతని యందు భక్తికలవాఁడగుటవలనఁగదా తాను లోకవిఖ్యాతుఁడైనది. మఱియు నతనిగురుపుత్రుఁడుకూడ నుపసంహరింపలేని యస్త్రమును గురుభక్తి కలవాఁడగుట వలనఁగదా యాయర్జునుఁడుపసంహరింపఁగలిగెను. కాఁబట్టి యట్లులనె ప్రతివారును గురుభక్తి కలిగియుండినయెడల వారికి మేలుకలుగును. కాన మున్నెట్లున్నను మనమీదినమునుండి యీవిధమున నుండుదము,

క. సద్గురుకృప జ్ఞానంబున
సద్గతిదీపించుచున్నఁ జాలగఁ జనువుల్
సద్గతిఁగలుగం జేసెడి
సద్గురువే దైవమనుచుఁ జాటర వేమా!

## రాజభక్తి.

---

మనలను సుఖముగాఁ బరిపాలించు రాజులయందు భక్తిగా నుండుట రాజభక్తి యనఁబడు.

రాజన నెవరన? మంచికొలమునందుఁబుట్టినవాఁడును, శౌర్యముగలవాఁడును, నీతిశాస్త్రవిశారదుఁడును, ప్రభుమంత్రోత్సాహశక్తిసంపన్నుఁడును, ధీరులును, సకలశాస్త్రసంపన్నులును, ధర్మశాస్త్రతత్వజ్ఞులునగుపండితులును, ప్రభుహితాభిలాషులును, సదసద్విమర్శనజ్ఞానముకలవారును, రాజనీతిచతురులునునగుమంత్రివర్యులను నిరుపమానంబగు పరాక్రమమును,నిశ్చలమగుపట్టుదలయుఁగలిగినభటవర్యులను గలిగినవాఁడు రాజని పల్కనగు.

ఈరాజు, తనరాష్ట్రములో,గురుతైనను దుర్మార్గులై ముందువెనుకలువిచారించక యితరులకపకారములఁ జేయుచుండినయెడల వానినిఁబ్రకటనముగాఁ జక్కఁగాశిక్షించును. దూరాలోచనగలిగినమంచిమంత్రులతోడ నేకాంతమున మంతనంబొనరించి పనులనారంభించి యడ్డుపాట్లురాకుండఁ దనపనులఁగొనసాగించుకొనుచుండును. జనులకు,మంచికొలమును, మంచిబుద్ధియును, మొదలగుసద్గుణములకెల్ల నీరాజేకారణము.రాజు దైవముతోసమానుఁడు. కావున నేఁ “నావిష్ణుఃపృథివీపతిః” అనఁగా “రాజైనమనుజుఁడు విష్ణు”వని మనయుద్గ్రంథములన్నియు నొక్కిపెట్టునఁబల్కుచున్నవి. మన మారాజు సాహాయ్యములేనిదే యేపనినిఁ జేయఁజాలము. మనధనముగాని ధాన్యముగాని దేనినైన నారాజుయొక్క తోడుపాటు లేనిదే నిలుపుకొనఁ జాలము. చూడుఁడు. మనము భూమిని దున్ని విత్తనములఁజల్ల నవి మొలకలెత్తి క్రమక్రమముగా

వృద్ధిఁజెంది పంటపండినతరువాత నింటికాధాన్యమును తెచ్చు కొందమనియూసచేసుండ నింతలో నాభూమినిఁ జోరులు సొచ్చి భయమువిడనాడి యాధాన్యమును హరించుచుండఁగా వారికనులకు మనమగుపడితిమేని మనలఁదన్ని యథేచ్ఛము గా నాపంటనుగోసి తీసికొనిపోవుదురు. ఇటువంటియన్యాయ ము సంభవించున దేసమయమునందు? రాజు లేనిసమయము నందుఁగదా. కాఁబట్టి రాజులయొక్కసహాయము ముఖ్యము గాఁగావలయును.ఇంతయేల?ఆరాజసాహాయ్యమువలననే మన ముబ్రతుకుచున్నామని చెప్పనొప్పు.

రాజు, విద్యలునాశనములగుచున్నటులఁ గానుపించిన తత్క్షణమే యవి యభివృద్ధికివచ్చుమార్గము లాలోచించి యభి వృద్ధికిఁదీసికొనివచ్చును. జనులసుఖదుఃఖముల నారయుచుం డును. "వర్ణాశ్రమాచారధర్మంబుల నడువుఁ"డనిబోధించును. బీదలను, సాదలను బోషించుచుండును. దిక్కులేనివారి కెల్ల దిక్కై పోషణఁజేయుచుండును."దుర్బలస్య బలంరాజా" యన వినవే? ప్రజలను రక్షించుటవలనను, శిక్షించి సన్మార్గమునఁ జొన్పుటవలనను, దనకొమరులవలె భరించుటవలనను బ్రసిద్ధిఁ జెందినరాజులే రాజులు. తక్కినరాజులు తరాజులని వచింప వచ్చును.

మున్ను శ్రీరాముఁడు బాల్యముననే విశ్వామిత్రాజ్ఞాను సారముగాఁ జెడ్డవారలగుతాటకామారీచుల దర్పమడఁగించె ను.యూవనమునఁ గారణాంతరమునఁ బితాజ్ఞాపరిపాలననిమి

త్తమై యడవులకుఁజని ఖరదూషణ రావణాద్యసురులఁ జీత్తె ను. తదుపరి మగుడ స్వగ్రామమునకువచ్చి యనుజాదులు పరి వేష్టించియుండ రాజ్యమధిష్ఠించి జనులకుఁ దగినస్వాతంత్ర్య మొసంగి రాజ్యముఁబరిపాలించి వాసిఁగాంచెను. కాబట్టినే యిప్పటికి మనవారలు "రామరాజ్యము సుగ్రీవాజ్ఞ వానికేమి రా" యనిపలుకుచుందురు.

ఇటులఁ దగినస్వాతంత్ర్యమునొసంగి సుఖముగాఁబరిపా లించినరాజులయందు మనము భక్తిగానుండక పోతిమేని దై వమునకు ద్రోహముఁజేసినవారమగుదుము. మఱియు నిహ లోకమునఁగష్టములఁ బొందఁగలము. కావునఁ బ్రతివారును రాజభక్తి కలిగియుండవలెను. రాజభక్తి కలిగినవారలు రాజా నుగ్రహపాత్రులుకాఁగలరు. దాన విశేషఫలములఁ బొందఁ గలరు.

పైనఁదెలిపినవిధమున రాజభక్తిగలిగి ఫలములఁబొం దినవారితఃపూర్వమే చాలమందికలరు. వారిలో నొకనిని జెప్పెద.

ధృతరాష్ట్రమహారాజపుత్రుండగుదుర్యోధనుఁడు కర్ణుఁ డనునొకనినిఁజేరఁదీసి సంభావించుచుండెను. ఆకర్ణుఁడారాజు నందతిశయభక్తికలవాఁడై యుండెను. దానినారాజరాజు కాంచి సంతుష్టిఁజెంది యంగరాజ్యమునకు రాజుగా నభిషేకిం పఁజేసెను. తదుపరి తనపినతండ్రికొమరులగుపాండవులకుఁదమ కుఁగయ్యము రాజ్యవిషయమునఁగలిగెను. అ[illegible] నారా

జేకర్ణునే నమ్ముకొని యుండెను. ఇటులుండఁ గలహమునాపి పాండవులకు వీరికి సంధిఁజేయుటకై శ్రీకృష్ణమూర్తి దౌత్యమువహించి వచ్చి ధృతరాష్ట్రాదులతో సంభాషించెను. కాని యాయనవచ్చినదానికి వీరువిముఖముగా మాటలాడ మొదలిడిరి. అంత దీనినిఁ గృష్ణుఁడుకాంచి సంధికుదురకపోయెఁగదా యని డెందమున విచారించుచు మరలుసమయమునఁ గర్ణుని మాత్రముఁబిలిచి రహస్యముగా నిటులఁబలికెను. "కర్ణా! నీవు గురువరాదులందెక్కువ భక్తికలవాఁడవు. ధర్మజ్ఞుఁడవు. కాన నామాటవినుము. గొంతి కన్యాత్వమున నదీసమీపమున దుర్వాసదత్తమంత్రపరీక్షార్థమై భాస్కరునిఁగోరి యాతనియనుగ్రహమున నిన్నుఁగనినది. కాఁబట్టి పాండురాజాగ్రసూతివైన నిన్ను, నావలన ధర్మరాజాదులు తెలిసికొని సేవించఁగలరు. నిన్నే ప్రాజ్యంబగు రాజ్యంబునకు నాయకునిగాఁ జేయఁగలరు. నీకుఁ బురవీధుల నుత్సవంబొనర్తురు. నీకు ధర్మరాజు యువరాజై నీపక్కనుండి ధవళచామరంబుల విసరఁగలఁడు. భీముఁడు తెల్లనిగొడుగును బట్టఁగలఁడు. అర్జునుఁడు సారథ్యంబు సేయఁగలఁడు. పాంచాలాది సేనా సమన్వితంబుగా నకుల సహదేవులు నిన్నుఁగొలువఁగలరు. మఱియుఁ ద్రిలోకసుందరి యగుద్రౌపదికూడ నిన్నువరించఁగలదు. కానఁ బాండవులఁ గలసి పైలాభములఁబొందు"మని బోధఁజేసెను. అంతట రాజభక్తిరతుఁడగుకర్ణుఁడా కృష్ణుఁడు సల్పినస్తుతికిని, వచించిన లాభములకు నుబ్బక యిట్లుత్తరమొసఁగెను. "స్వామీ! మీరు

చెప్పినదంతయు సత్యమే కాని నన్ను "సూతపుత్రుఁ"డని నిర్ల క్ష్యము చేయక చేరఁదీసి తనయనుజులకన్న నెక్కుడు ప్రేమతో గారవించి నేఁ గోరినవానినన్నిఁటినిఁ దెచ్చియిచ్చి, మనఃప్రమోదంబొనరించుచు నన్నుఁ దనయంతవానినిగాఁ జేసిన యీ రాజరాజును విడిచివచ్చుట నీతిబాహ్యమని నీవెఱుఁగనిదే? నే నాలాభములకై యాసపడను. తుదకు నాప్రాణములనైనఁ గోల్పోవుదుఁగాని రాజద్రోహినిమాత్రము కాఁజాల"నని చెప్పి యారాయబారినిఁ బంపివేసెను. అటుతరువాతఁ గుంతి, "రాధాపుత్రుఁ"డనియనుపించుకొనుచున్న తనపుత్రుఁడేకాంతముగా భాగీరథీతీరముననుండుటఁగనుగొని యించుకంతభేదముగాఁ బైవిధముననే బోధఁజేసెను. అంతటఁగర్ణుఁడు "అమ్మా! నీకొమరుఁడనైనను జిన్ననాఁటనుండి వారియన్నముఁదిని వృద్ధికివచ్చిననేను వారినివిడువఁజాలను. మిమ్ములచేర"నని దృఢముగాఁ జెప్పెను. అంతఁ గుంతీదేవి కొన్నివిషయములాకర్ణనఁజేసెను. వానికిఁ గర్ణుఁడుత్తరములనొసఁగి యామెనువీడ్కొలిపెను.

కనుగొంటిరా? పాండవులఁగలసిన ననేక లాభములఁబొందఁగలనని యాకర్ణుఁడు తెలిసికొనియు రాజభక్తిరతుఁడై యాలాభములఁ దృణములుగా భావించి కలియక యుండెను. అది యెంతనిశ్చలమైన రాజభక్తియో కంటిరికదా. కావుననే యా కర్ణుఁడు రాజరాజుచే ననేక ఫలముల నందఁగలిగెను. కానఁబ్రె

స్తుతము మనలను సుఖముగాఁ బరిపాలించెడి రాజులయందు భక్తిగానుండి ఫలములఁబొందుటకుఁబ్రియత్నముచేయుదము.

క. జనులకు నెల్లను బూజ్యుఁడు
జననాయకుఁడతనిమహితశాసనమున స
జ్జనులును మునులును సద్విధి
జనువారలుకాని కడవఁజనఁగా దెపుడున్.

(భారతము.)

---

# విద్య.

---

విద్యయనలోకములోనిసమస్తవస్తుగుణస్వభావాదులఁ దెలిసికొనుట.

ఈవిద్యయనునది లేనిదే మనుజుఁ డభివృద్ధికి రానేరఁడు.ఇది కాఱు క్రమ్ముకొన్న చీఁకటుల ధ్వంసముఁ జేయు సూర్యునివగిది విరాజిల్లుచుండును. విజ్ఞానమొదవించుచుండును. అపకీర్తి హరించుచుండును. సత్కీర్తి వృద్ధిఁజెందించుచుండును.ఇది మంచి,యిది చెడ్డ, యిదిన్యాయ, మిదియన్యాయమను సంగతుల నీవిద్యవలనఁ దెలిసికొనవచ్చును. పరోపకారాది బుద్ధులలవడును. నిరామయసౌఖ్యములు చేకూరుచుండును. ఇంకను నీవిద్యను ధనముతోఁ బోల్పఁదగును. కొన్నికొన్నికారణములచే సాధనముకన్న నీవిద్యాధనమే యధికమని చెప్ప

వచ్చును. ఏలయన? ఆధనమువలె నీవిద్యాధనము దొంగల చేతులఁ జిక్కదు. భోగాదులచే హరించదు. అన్నలు,దమ్ము లు మొదలగుబంధుగులు మోసపురీతినైనను హరించనేరరు. దిక్కులేనిధనము రాజుస్వీకరించినటుల నీవిద్యాధనము స్వీకరింపనేరఁడు. మఱియు నీవిద్యాధన మితరుల కెంతయెక్కువగా దానముఁజేయుచుండిన నదితఱుగక యంతయెక్కువ వృద్ధిఁ జెందుచుండును. కాబట్టి యాధనముకన్న నీవిద్యాధనమే మిగుల గొప్పదియని చెప్పనగు.

ఈవిద్యయే, మన జనకు ననువగునందము. స్వదేశము నందుమిత్రము. పరదేశమునందుఁజుట్టము. ఇదియే సకల సుఖదాయిని.ఇదియే రాజవశ్యముఁ గలిగించును.ఇదియే దైవము.ఇదియేతల్లివలెఁ దన్నురక్షించుచున్నది.

తండ్రివలె శిక్షించి సన్మార్గమునఁ జొన్పుచున్నది. అనుకూలవతియగుభార్యవలె మనమునురంజింపఁజేయుచున్నది. వేయేల? సర్వకాలమందుఁ గల్పతరువుమాడ్కి నన్నికోరికల నిచ్చుచుండె దీవిద్యయే!దీనినివర్ణించుటకు నలువకైనను దరముగాదు. కాబట్టి యిట్టి విద్యను మనమభ్యసించిన గౌరవించుటకుఁదగినవారలము కాఁగలము.

ఈవిద్య యఱువదినాలుగు తెఱఁగులై భాసిల్లుచున్నది.వానినామధేయము లెవ్వియనిన?.

(1) ఋగ్వేదము (2) యజుర్వేదము (3) సామవేదము (4) అథర్వణవేదము (5) శిక్ష (6) వ్యాకరణము (7) ఛంద

ము (8) నిరుక్తము (9) జ్యోతిషము (10) కల్పము (11) పూర్వమీమాంసము (12) ఉత్తరమీమాంసము (13)పురాణము (14) ధర్మశాస్త్రము (15) గానము (16) కవిత్వము (17) దేవభాష (18) వ్రాఁతవ్రాయుట (19) చేతనాచేతనవిభాగము (20) జూదము (21) కళాశాస్త్రములేకకొక్కోకము (22) ధనుర్విద్య (23) శకునము (24)సాముద్రికము (25) రత్నములఁ బరిశీలించుట (26) తేరునడపుట (27) నేర్పుగావండుట (28)గుఱ్ఱములనెక్కుట (29) మల్లశాస్త్రము (30) ధాతుగంధరసవాదములు (31) కాలముకానికాలమునందుఁబువ్వులు మొదలగు వానినిఁబుట్టించుట (32) మొనకట్టు (పెట్టుడు మందు) (33)వాకట్టు(వాక్కునుమాటలాడకుండఁజేయుట) (34) ఉదకాగ్నులశక్తినిసణఁగఁజేయుట (35) ప్రవాహమునాఁగించుట (36) రహస్యపుఁబనులందుఁ జమత్కారము(37)మహేంద్రజాలము(38)ఇతరులనుస్వాధీనముఁజేసికొనుటకై మూర్ఛఁబొందించుట. (39) ఘుటికలచేఁగోరికఁబొందుట (40) మోసములు (41)ఉండికము పడకుండ నుండుట (42) దొంగతనము (43) దూతకృత్యము (44) వేటాడుట (45) విహంగగమనభేదజ్ఞానము (46) చిత్రరువులవ్రాయుట (47) మణిమంత్రిక్రియలు (48) లోహకారకత్వము (49)సాలెపని (50) రజకకారకర్మము (51) చర్మకారకత్వము (52) బాళ్ళనుబగులగొట్టుట. (53)కుటకారకర్మము (54) చేరము (55) జ్ఞానసామర్థ్యములు (56) అంజనభేదములు. (57) మేనరిపని (58) వ్యవసాయము (59) రాజమో

గామలతో వాదమునల్పుట. (60) లావుకకూర్మకుక్కుటమేషము మొదలగుపక్షిమృగములకుఁ దగవులాటఁ బెట్టుట. (61) వాక్యములచే సిద్ధిఁబొందుట. (62) విరోధముచేఁ జేయుసచ్చాటనోపసంహారంబులు. (63) పాశుపల్యము (64) స్వరముచేత వంచనముఁ జేయుట. అనునివి.

ఈవిద్యలనన్నిఁటినిఁ దెలిసికొని యుండవలెను. ఈయఱువదినాలుగువిద్దియలలో జూదము, దొంగతనము, మోసము, మొదలగు చెడుగుల నాచరణమందువిడిచి మిగిలిన మంచి పనులను నాచరించుచుండవలెను.

మన మీ యఱువది నాలుగింటిని నభ్యసించుటకు వీలులేకపోయినను దుదకొకసర్వజనసమ్మతమైన మంచివిద్యనైన నభ్యసించి యందున విద్వాంసులముకావలయు. మనమటులయినమొదల గురువరాదిజనులామోదమునుఁ బొందెదరు. మనతలిదండ్రులు మొదలగుచుట్టములానందించుదురు. విద్యావిశారదుఁడు దరిద్రుఁడైనను గౌరవమునకర్హుఁడు. విద్వాంసుఁడు కుంటివాఁడైనను గ్రుడ్డివాఁడైనను సుందరరూపవిహీనుఁడైనను బూజ్యుఁడు. ఎటులనఁ? చెఱుకు, ఎన్నివంకలఁబోయినను మాధుర్యముండుటంబట్టి దానినిగ్రహించుచున్నాముకదా. విద్యనునేర్వనివాఁడు సరసుఁడు కానేరఁడు. సరసుఁడు కానివాఁడు బ్రహ్మసృష్టుఁడు కాఁడుకదా. చక్కఁగా విద్యనేర్చినవానివచనమొక్కటియైనను వినుటకు జనులుత్సహింతురు. కాని విద్యావిహీనునివచనమొకటిగాని పదిగాని వినుటకు

జనులుత్సహించరు. కారణమేమన? లోకమునఁ గాకులవాకు లవినుటకుజనులుత్సహించెదరా? ఉత్సహించరు. కతమేమన? కాకరవములు కర్ణకఠోరము లగుటయే. మఱియుఁ గోకిలస్వనములనాలకించుటకు జనులిష్టపడుచున్నారా ? ఇష్టపడుచున్నారు. కారణమేమన? పరభృతనినాదములు కమ్మనినాదములగుటయే! కాఁబట్టి వివేకులగుపండితులవచనములుసమాదరణీయములు. కుపండితాపండితవచనములు త్యాజ్యములు. కొన్నివేళలయందపండితులు మంచిమాటల వచించిన నవి గ్రహింపఁదగినవని తెలిసికొనునది. భార్యయు, భర్తయుఁజక్కఁగా విద్యనేర్చి నీతియుతులై కలిసిమెలసి కాఁపురముఁజేయుచుండినపుడు వారికిఁగలయానందము మఱియొకరికిఁగలుగనేరదు.

ఇఁక విద్యనేర్వనివారికి, నాలుగుకాళ్ళులేని కొఱంతయొకటితక్క మృగములకును వీరికిని నంతరం బింతయును గాన్పింపదు. ఈవిద్యావిహీనులు మంచిచెడ్డలెఱుంగరు. లాభాలాభముల గుర్తెఱుంగరు. పెద్దలు చెప్పినబుద్ధినివిని తమతప్పులను దిద్దుకొనరు. విద్యావిహీనుఁడు మదనసమానసౌందర్యముకలవాఁడైనను యౌవనమధ్యస్థుఁడైనను మంచివంశమునందుఁ బుట్టినవాఁడైనను విద్యలేనికతన గ్రుడ్డిగవ్వకైనను గొఱగాక యుండును. మోదుగపువ్వు, ఎంతసుందరముగానున్నను సువాసనలేనికతనఁగదా జనులు దానినిఁగనులఁ గనుగొనరు. ఫరాసుహూణయవనాదు లీవిద్యాతిశయమువలననే

భాసిల్లుచున్నవి. కాని వేఱొకదానిచేఁ బ్రకాశించుటలేదు. చీఁకటిలోఁ గనఁబడనిపదార్థములు దీపమువలనఁగదా కనఁబడుచున్నవి. అటులనే యీవిద్యవలన మనకుఁదెలియనిసంగతులఁ గ్రమముగాఁ దెలిసికొనవచ్చును. సర్వవిధములను సద్యశమొసంగు నీవిద్యను జదివికాదె శంకరాచార్యులు ప్రసిద్ధికెక్కినది. ఆయన చరిత్రిమించుకఁ దెలియఁబఱచెద.

శ్రీశంకరాచార్యులు చిఱుతప్రాయముకలవారైనను మంచిబుద్ధి నలవరించుకొని తల్లియందు భక్తికలవాఁడై గోవిందపాదాచార్యులకడ విద్యాభ్యాసమొనరించి గొప్పపండితుఁడాయెను. అంతట వ్యాసరచితబ్రహ్మసూత్రములకు భాష్యమొనరించి 'భాష్యకారు"లని వాసిఁ గాంచెను. అంతట లోకమున వక్తృశిఖామణియై కవివరుఁడై యోగీశ్వరుఁడై యప్పటికిని జగద్గురువని వన్నెకెక్కుచుండెను. వారిగ్రంథములు నీతిదాయకములు. వారివేదాంతమార్గ మనన్యసామాన్యము. వారెన్నఁడో విధివశులైనను నేఁటివఱకు వారిపావనజీవితము జనులకుఁదెలియుటయెటుల? విద్యవలననేకదా. కాఁబట్టి ప్రతివారును విద్యనేర్చి ధనముసంపాదించి వివేకముకలిగి సుఖముగా నుండవలెను. ఈవిద్య నేర్చుట[illegible]దేసమయమందనిన? ఏడేడులువచ్చినదిమొదలు [illegible] వత్సరములవఱకు విద్యనభ్యసించవలెను. [illegible] సకలజనసమ్మతమగుమంచివిద్యను నేర్చి [illegible] మనము గౌరవభాజనులమగుదుము. [illegible]

తే. గీ. "విద్యయొసఁగును వినయంబు • వినయమునను
బడయుఁ బాత్రత పాత్రత • వలన ధనము
ధనమువలనను ధర్మంబు • దానివలన
నైహికాముష్మికసుఖంబు • లందు నరుఁడు."

---

## సత్యము.

సత్యమనఁగా నితరులచేఁ జెప్పబడినదికాని వినినదికాని తానుజూచినదికాని యున్నదానిని నుడువుటయే.

ఇటులఁ జెప్పఁబడినవిషయమందును, వినినవిషయమందును, గనినవిషయమందును, బుద్ధిపూర్వకముగాఁ దాఱుమాఱుగా లేనిపోనివి కల్పి చెప్పుట యసత్యమనబడు.

ఈయసత్యముఁ బలుకువా రవినీతులు. వీరు చెప్పువాక్యముల నెవరును విశ్వసింపరు. విశ్వసింపకపోవుటవలనఁ దమ కావశ్యకములైనపనులన్నియుఁ జెడిపోవును. చెడినతోడనే యలజడులఁ జెందుదురు. చెందినవెంటనే డెందమునం దనేకవిధములఁ గుందుచు దరిఁగానక యుండుదురు. దీనివలనఁ గ్రమముగా మనోవ్యాధి జనించఁగలదు. ఈమనోరోగమువలన మృతిఁజెందినఁ జెందవచ్చు. ఈయసత్యమాడువారు ఘోరనరకవాసులై యుందురు. "అసత్యమాడుట బ్రహ్మహత్యతో సమాన"మని పండితప్రకాండులు నుడివిరి. తన్నునెవ్వరైన నొకధర్మవిషయమును గురించి [illegible]

గతి తనకుఁ దెలిసియు నూరకుండువాఁ డసత్యదోషమునం దర్థ భాగఫలముఁ బొందఁగలఁడు. వీఁడును గౌరవార్హుఁడు కాఁడు. అసత్యమనిత్యముకాన మనమెట్టిసమయమునం దసత్యమాడ కూడదునెరిగఁదా మనము వీక్షించుచుండఁగాఁ బరులు కల్ల లాడుచుండినయెడల నాపాడుబాటనుండి వారినిఁ దప్పించుట కు యత్నించుచుండవలెను. ఒక్కొక్కసారి యసత్యవాదిత్వ మువలన లాభముఁబొందినను దుదకది యశ్రేయస్సునకా కరం బగు. "అసి తప్పరాదు, పలికి బొంకరాదు." సత్యమాడినందువల న లాభమువచ్చినను నష్టమువచ్చినను సంతోషించుటయే సత్తముని లక్షణము. కాన నసత్యమాడుట యేరికైనను నెప్పుడైనను మంచిదికాదు.

సుజనుఁడొకఁడు ధర్మసందేహముకలిగి దానినిదీర్చు కొనుటకై పండితమండితంబగుసభకువచ్చి తనమదినున్నసం దేహముఁ దీర్పుఁడని యాకోవిదుల నడిగెను. అంతట నావిప శ్చితులఁదాతఁడడిగినదానికు త్తరమొసఁగఁబూనియు లాభము కలుగుననికాని, పిసినితనమువలనఁగాని, పక్షపాతముచేఁగాని ధర్మవిరుద్ధముగాఁబలికినయెడల వారనృతదోషఫలమునుబొం దుదురు. కాన నున్నసంగతి చెప్పితీరవలయును. ఇదియేసమంజ సము.

సత్యమునకుసాటియైనధర్మము వేఱొకటిమంచిదికానంబడ దు. సత్యమాడుచుండెడువాని మనమున భీతియుండదు. రమణీయము గనుండును. వివేకులు సంతోషించక యుండరు. కాశీ మొదలగు

పుణ్యతీర్థముల సేవించిన నెంతఫలముకలదో యంతఫలముకల దు. నాలుగువేదములను, వానియంగములను బఠించిన నెంత పుణ్యముకలదో యంతపుణ్యము కలదు. సత్యసంధత వలనఁ గోపము, కామము, లోభము. మదము, మాత్సర్యమనునీయు రిషడ్వర్గము నడఁగుచుండును. ఓర్పు, వినయము, శమము, మొదలగుసుగుణములు చేకూరుచుండును.

ఇదిగాక మన యార్యులీసత్యమునునొకతపస్సుగా గ ణనఁజేసిరి. ఈతపమునాచరించినవారి కిహలోకమున సమస్తై శ్వర్యములు కలుగుననియుఁ బరమున స్వర్గలోకము నివాసము కాఁగలదనియు వచించిరి. "సత్యమేవజయతి, నానృతం" అ నఁగా "సత్యమేజయించుచున్నది, అనృతముజయించుటలే"దని యుపనిషత్తులు పలుకుచున్నవి. ఒకపరి మనమనములకు సత్య మాడుటవలనలాభము లేక నష్టమున్నటులఁదోచినను దుదక ది శ్రేయస్సునకు మూలకంబుగాఁ బరిణమించును. నిత్యమును సత్యమును బలుకువారు మృతజీవులు కాఁగలరు.

అటులమృతజీవులై వాసిఁగన్నవారిలో నొకనిఁజెప్పెద మున్నాహరిచంద్రమహారాజు సత్యమాడుటయందుని రుపమానుఁడని భూతలమున వాసిఁగాంచియుండెను. అంత నిం ద్రలోకమున, మునులు సింహాసనాసీనులై యుండ నాయింద్రుఁ డు చే, భూతలమున నెల్లప్పుడు సత్యమాడు వారెవరని ప్రశ్న వచ్చెను. దానికి వసిష్ఠుఁడను నొకముని హరిశ్చంద్రుఁడని యు త్తరమొసఁగెను. అంతట విశ్వామిత్రుఁడు క్రోధోల్లసితమూ

గ్రియె యతఁడు కాఁడని దృఢముగాఁ జెప్పెను. అంతట నా మునులిద్దఱికిఁ గలహము క్రమముగాఁ బెరిగెను. అంత నిద్దఱు కొన్నిపంతముల నేర్పఱచుకొనిరి. విశ్వామిత్రుఁడు తనపంతము గెలువవలయునని యనేకోపాయములాలోచించి యింద్రుని వేఁడ్కొని యాహరిశ్చంద్రమహారాజుదరికివచ్చి "నేయజ్ఞముచేయఁదలచితిఁగాన నీవు నాకేనుఁగుపై నెక్కి గవ్వఁబైకెగరవేసిన నెంతయెత్తుంకునో యంత యున్నతము గల ధనరాశినిప్పింపవలయు"నని కోరెను. దానికారాజంగీకరించి ధనమునిచ్చివేసెను. అంత నాగాధేయుఁడు తిరిగి యారాజుసమీపముననే యాయర్ధము నుంచెను. అంత నారాజు విశ్వామిత్రుని సంభావించి పంపించెను. తరువాత నాముని తనయాశ్రమమున కరిగి దుష్టమృగములను సృజించి యారాజును దనసమీపమునకు రప్పించుకొనెను. మాతంగకన్యలసృష్టించి యధర్మంబునకుఁ బాల్పడి మమ్ము వివాహమాడుమని కోరుండని చెప్పి యారాజు సమీపమునకు వారినిఁబంపించెను. వారాముని వచించినటులనే యారాజును వివాహమాడఁగోరిరి. అంత నారాజధర్మంబని తిఱిమివేసెను. ఆసంగతి నాముని విని, కినిసి, యదలించి, మాయోపాయమున నాతనిచే రాజ్యము దానముగాఁ గైకొని యారాజును సకుటుంబముగాఁ గానకమునకంపెను. మఱియుఁ దానిదివఱకు దాఁచికొనియున్న ధనమును దీసికొనివచ్చుటకై వారివెంట "నక్షత్రకుఁడను తనశిష్యునిఁ బంపెను. ఆనక్షత్రకుఁ డనేకబాధలు వారిని గష్టపెట్టెను. దానికి రా

జు సహించెను. అంతనా నక్షత్రకుఁ డా రాజయొక్క భార్య నమ్మించెను. ఆతనికుమారునిఁ జంపించెను. మఱియు నా రాజు నుకూడ నమ్మెను. చక్రవర్తి యగు నీహరిశ్చంద్రుని కాటికా వలివానికిఁ గొలువుగానిగాఁ జేసెను. అనక్షత్రకుఁ డనేకవిధ ముల నీరాజున కసత్యమాడుమనిబోధించెను. అది నిష్ఫల మాయెను. తుదకా రాజుచేత నే యతనిభార్యను లేనిపోని నేప ములఁబెట్టి చంపింప సమకట్టెను. ఆతఁడు తన యజమాను ని యాజ్ఞానుసారముగాఁ దనభార్యయని తలఁచక ఖడ్గము చేఁ గొని యావధకార్యము నెఱవేర్పఁబోవుతఱి విశ్వామిత్రుఁడు వచ్చి "హరిశ్చంద్రా! ఊరుకొనుము. నీవొక యసత్యమాడిన నీకష్టములన్నియు నీక్షణముననే పాపఁగల"నని చెప్పెను. దాని కారాజు "స్వామీ! సంతసించితి. మీరనిన పగిది నేనసత్యమా డఁదలంచిన యెడల నిన్నికష్టముల ననుభవించ కుండెడివాఁ డను. నే నాయసృతదోషమున కొడిగట్ట లేకయే యిట్టి యి క్కట్టులఁ బొందుచుంటిని. కాన దయచేసి యిచటనుండి వెడ లు"డని చెప్పి తిరిగి తత్ప్రయత్నమాచరించుచుండ బ్రహ్మ విష్ణుమహేశ్వరులు వచ్చి యావనినాపి "నీసత్య వ్రతమునకు మెచ్చితిమిగాన వరములఁ గోరు, మని పలికిరి. అంతట నా మూ గురుమూర్తులు వారుకోరినవరములిచ్చి కుమారునిబ్రతి కించి తిరోధానమైరి. అంత విశ్వామిత్రుఁడు కూడ నాతనిదృ ఢసత్యవ్రతమునకు మెచ్చుకొని యిదివఱకుఁ బంతమున వ చించినపగిది తనతపమునం దర్ధభా..ష ము ధారవోసి యా

తనిని గ్రిహస్థుఁ సార్వభౌమునిఁజేసి చక్కఁగా నాశీర్వదించి చనెను.

పరికించితిరా? ఎన్నికష్టము లనుభవించినను సత్యము మాత్రము విడనాడకపోవుటవలనఁగదా యాగాధేయుని శాపము నందరభాగఫలముఁ బొందఁగలిగెను. బ్రహ్మర్షిగాల పర్వముల నాపత్సముచేతనేకదా యీరాజు పొందినది. అదిగాక యీమహారాజు "సత్యహరిశ్చంద్రుఁ"డని యిప్పటికిని బ్రసిద్ధిఁ జెందియున్నాఁడు "సంత్యవద సత్యాన్న ప్రమదితవ్యం" అనఁగా "సత్యము చెప్పుము, సత్యమును మఱువకు" మని శ్రుతులు పలుకుచున్నవి. తనయజమానునికి నిష్టమైనను, సత్యమునే చెప్పవలయునుగాని యిష్టమగునని యెంచి యసత్యముఁ జెప్పకూడదు. సాధుస్త్రీల యందును, బీదవారల వివాహములయందును, మొదలగుసమయములందసత్యమాడినను దోషములే,,దని కొందఱు పెద్దలు వక్కాణించిరి. ఈ యాధారమువలనఁ జీటికి మాటికి నసత్యమాడుట శ్రేయమో దాయుకమని తలఁచెదరేమో? అట్లుఁ దలఁచుటతప్పని మున్మాటని నమ్ముడు. ఈసత్యమువలన సమస్తసత్కర్మములు కరతలామలకములుగా నుండఁగలవు. కాన మనమందఱము సర్వజనసన్నుతమగు సత్యమునే పల్కుచుందము. ఆపదలకాకరంబగు నసత్యమును విడనాడుదము.

క. నడవడియను మున్నీటిం
గడచెర్పంగనోడ సత్యకరణిం దగితా

నోడఁగూడదనిన సత్యము
గడచినగుణమింక నొండు గలదే? యరయన్॥

(భారతము)

---

# శాంతము.

---

## శాంతమున నోర్పుగా నుండుట.

శాంతమనునది సర్వోత్తమమైనది శాంతముఁదాల్చిన వాఁడు కత్తుల సహస్రముల నోడించినవానికంటె నధికుఁడని చెప్పనగు. ఇతరులు తనపయి నలిగినను మగుడ నలుగకయుఁ దిట్టులఁదిట్టిన నవి విని విననియటుల నటించి యెదురు మాటలాడకయుఁ, బరిభవకరములగుఁ బనులఁ జేఁబొందిన నవి డెందమందు విచారింపకయు నుండువాఁడు శాంతుఁడనంబరగు. పాపము మనమునముల శమమువిడనాడిన విపత్తులఁబొందఁగలరు. నీతిభగ్న రహితంబగు రాజ్యంబును, నిర్లక్ష్యంబగు సంపదయు, శమములేని తపసియొక్క తపమును, భిన్నమైన కుంభయుం మదకమిమ్మటు లేయగును. ఓర్పులేక పనులనారంభించిన మొదల నవి నిర్మూలములగును. అదిగాక హానియుఁగూడ సంప్రాప్తించును. మనుజుఁడు శాంతము వీడిన కొలఁది కోపమధికమగుచుండును. కోపము హెచ్చుచున్న కొలఁది వానికి వాక్పారుష్యత్వ మెక్కువయగుచుండును. క్రమముగా క్రూరత్వము నిగ్గుచుండును. అల్పములగు కుక్కలు క్రోధవశులై నే

నుఁగును జూచి మొఱఁగుచుండ నాద్విపమాయలవులు విని యు విననియట్లునటించి తనత్రోవను జనుట లేదా? మొఱుఁగు చుండుకుక్కలాకరిని నిందుకయైన బాధించినవియై లాభమే మైనఁబొందినవా? నోరునొచ్చుటతప్ప లాభమేమియుఁ బొంద లేదనికదా చెప్పవలెను.

కాన శాంతుఁడు సహించుచుండవలెను. ఈయోర్పుఁగలిగినవాఁడు సకలజనులఁ జక్కఁగాఁ బరిపాలించు ప్రభువుతో సమానుఁడని చెప్పవచ్చు. వీఁడే శ్రీమంతుఁడు. ఎవరయినను మంచినిఁగోరదలేని వారిశాంతమును దాల్చియుండవలెను. ఈశాంతము వహించుటవలన సౌఖ్యములఁబొందఁగలరు. "శమ స్తపః" యని వేదములు వాకొనుచున్నవి. కాఁబట్టి ప్రతిమనుజునకిది యాచరణీయంబు.

ఈశాంతమువలన వృద్ధికివచ్చినవారలు చాలమంది కలరు. వారిలో నొకనిఁజెప్పెద.

సకలజనానందకరుఁడును, ధర్మమార్గ తత్పరుఁడును, సత్యవాదియు నగుధర్మరాజు తనపెదతండ్రి కుమారులగు దుర్యోధనాదులప్రోత్సాహమున ధృతరాష్ట్రునిచేఁ జక్కఁగాఁజూడఁబడకపోయినను గినియఁడాయె. వారు తనతమ్ముఁడగు భీమునికి విషాన్నముఁబెట్టించినను శాంతమును విడనాడలేదు. మఱియు నతనిని పాశములచేఁగట్టించి గంగలోఁబాఱవేయించినను గినుకఁజెందఁడాయె. తమ్మునాధార్తరాష్ట్రులు రాజ్యమునుండి వెడలఁగొట్టించినను నిదానము మానలేదు. మధ్య

వర్తులఁ బ్రోత్సాహమునఁ దనకువచ్చిన యర్ధరాజ్యమును శకునిమొదలగువారిచే జూదమాడించి యన్యాయముగాఁ గైకొనినను నోర్పును విడనాడలేదు. తుదకుఁ దమకు ధర్మపత్నియగుద్రౌపదీదేవినిఁ గుత్సితులగుదుశ్శాసనాదులు కొప్పుపట్టికొని బటబటనీడ్చుకొంచు గురువరులచేతను, గురువృద్ధులచేతను రాజులచేతను నిండియున్నసభకుఁ దీసికొనివచ్చినను శాంతమునువిడనాడలేదు. అంత నాదుర్యోధనాదు లామానినీమణినిఁ దుచ్ఛమగుసంభాషణ నాడుటవినియుఁ గూడ నాధర్మరాజు శాంతమును వీడలేదు. మఱియు నాదుర్యోధనాదులామెయడిగిన ప్రశ్నలకుత్తరమియ్యక వస్త్రాపహరణముఁ గావించుచు "నీమగలిక్కడ నేయున్నారు. వారు పౌరుషహీనులుగాఁ గనుపడుచుండిరి. అట్టివారల నీవుచేపట్టఁదగ"దని చెప్పుచు మానభంగమొనరించుచుండిరి. దానిని విని యతని యనుజులగు భీమాదు లాగ్రహావేశపరవశులయి "యిప్పుడే యీదుర్మదాంధులఁజంపి విడిచెద"మని దిక్కులుపిక్కటిల్లు ఘోరరవముతోఁ బలికిరి. అంత నాధర్మరాజు తానుకినియక వారికి "దమ్ములారా! ఇది సమయముకాదు. ధర్మవిరుద్ధముగా నొనరించకుఁ"డని సామవాక్యములఁజెప్పి వారినిఁగ్రోధరహితులనుగాఁ జేసి కానసములకు సతీభ్రాతృసమేతముగాఁ జనెను.

విలోకించితిరా! అట్టిమహాపత్సమయములం దోర్పును వీడక యాధర్మరాజుండెను. కాని ఘోరపములును బహిష్కర

ములు సువకు వసుమతిం దానుపొందినపు డీధర్మరాజువలె శాంతి ముందాల్చి మిన్నకుండినవారలు కలరా? లేరు. లేరని నొక్కి వక్కాణించవలయును. ఇట్టియసాధ్యమగునోర్పు నవలంబించుట వలననే యీధర్మరాజు కాలక్రమమున శత్రువులనందఱఁ జంపి సార్వభౌముఁడై సకలసామంతులును, జనసంచయమును, ధర్మముగాఁ బరిపాలింపఁ గలిగెను. మఱియు నాయమనందనుఁడు శాంతమువహించుట వలననేఁగాదె "యజాతశత్రుఁ" డని యన్వర్థనామమును బడసెను. ఆతనికీర్తి శాంతమునందిప్పటికి దశదిక్కులఁ దేజరిల్లుచున్నదికదా. కాఁబట్టి మనము, కష్టములఁబొందినను నోర్పునువిడనాడకయుండుదము. మఱియు దీనిచే మానవులఁ గొనసాగించుకొనుచుందుము.

క. ఒరులేయవియొనర్చిన
నరవర! యప్రియముతనమనంబునకగుదా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్.

—•—

## వినయము.

నమ్రముగాఁ బెద్దలసన్నిధిని నణకువగా నుండుట.

ఈ వినయము గలిగిన విద్యార్థికి మంచిగుణములు కలుగునని పదింపదియుగునిదా. దానివలన సకలసుజనమనోరమము విన యమునకే యబ్బును. ఈవినయమువలననే జనుఁడు తాఁదలఁచినపని

నిసేఁటవేశ్యకొనఁగలఁడు. వినయములేనివాఁడు పలునెంజిలులకు నోడిఁగట్టవలసివచ్చును. మంచి కొలమునందుఁబుట్టినాఁడని గర్వముఁజెందక యణఁకువగలిగి యుండవలెను. విద్యావంతులలోఁ దాను మొదటివాఁడై వాసిఁగాంచినను నడఁకువవిడిచి మితిమీఱియుండుట మంచిదికాదు. అడఁకువగలిగినవాఁడు విద్యావిహీనుఁడైనను గౌరవార్హుఁడు కాఁగలఁడు. కురువేరుమూచుటకు సొబగుగానుండకపోయినను సువాసనయుండుకతన గౌరవభాజనమగుచున్నదికదా. అడఁకువగలిగిన నెట్టివనుతైనను సాధింపవచ్చు. వినయముగలవాఁడు శత్రువుచేతను గీడుఁబొందనేరఁడు. గొప్పవారలయనుగ్రహమునకుఁ బాత్రుఁడు కాఁగలఁడు. విద్యతో బాటు వినయముగలిగిన నెక్కువప్రకాశమానుఁడై భూజనులచే భూరిగఁ బొగడ్తఁగాంచుచుండును. సహజసౌందర్యమునకుఁ దగియుండు దళతళయును మంచివస్తులనుధరించిన నదియెక్కువప్రకాశించుట మనమీక్షించుట లేదా? ఈసుగుణగణముల నొసఁగువినయము నుత్తముఁడవలంబించును. కొలఁదివారలు విద్యాసామర్థ్యాదులు లేకపోయినను పెద్దలసన్నిధినైన నణఁకువగానుండక నిక్కుచుందురు. రత్నాకరుఁడగు సముద్రుఁడు జలమెంతయధికముగాఁ గలిగినను మితి(చెలియలికట్ట)మీఱక మరల వెనుకకుఁబోవుచుండుటయు, వాగు కొంచెమునీరెక్కువకాఁగానే మితిమీఱి నాశనమవుటయు మనముచూచుచున్నాముకదా. అట్లుఁ పెద్దలదగ్గఱనిక్కుచుండుటగాదని సుమవినయసంపత్తులు

తలఁచుచుందురు. కాని యదివట్టిభ్రమయని నమ్మఁడు. దుర్జనుఁడు వినయవిరహితుఁడై కన్నులఁ బైకిఁజూచుచుండును. సజ్జనుఁడు సుగుణములచే నిండుకొనియున్నను దలనువాంచి వినయముగాఁ జూచుచుండును. లోకమునఁ గొమ్మలులేనిమ్రోఁడు నభమువంకఁజూచుటయు, సుమనోమనోజ్ఞంబులగు ఫలసుమాదులనిండుకొనియున్నతరువు తమశాఖల నొంచికొనియుండుటయు మనమీక్షించుటలేదా? కాఁబట్టి యటులనుండుట స్వాభావికమే. తాను ధనవంతుఁడైనను విద్యావంతుఁడైనను దరిద్రునిఁగాని విద్యావిహీనునిఁగాని చూచి నవ్వకూడదు. నవ్వినయెడల వారునింకొకపరి మనలఁజూచి రెట్టింపుగా నవ్వఁగలరని తెలుసుకొనుఁడు. మూరెఁడు పెరిఁగి బారెఁడు కుంగుటయేల? మిత్రులారా! "అత్యుచ్ఛ్రయః పతనహేతుః" అనఁగా "నెక్కువ పెఱుగుట విఱుగుటకొఱకె" యనివినలేదా? కాన నెవ్వరైన నెప్పటికైనను నిక్కియుండుట మంచిదికాదు. లోకమున మానవులు వినయమునఁ జెప్పుమాటలవినుచుందురుకాని భయమున వచించుమాటలు వినుచుందురా? వినరు. ఆవుయొక్క పొదుగును దిన్నగాఁబితికినయెడలఁ బాలిచ్చునుకాని దానినిఁ గోసివేసినఁ బాలివ్వఁగలదా? ఈయదు. కాన వినయపూర్వకవచనములు విరోధి సాధనభూతములు ఈవినయమే సర్వత్రసాధకము. వినయములేక పెద్దల నవమానించినవారలు కష్టములఁబొందఁగలరు. తనకిదివఱకున్న కీర్తియుఁ గూడఁ బోవును.

ఇటుల విషయములేక పెద్దలనవమానించి చెడిపోయిన వారలు కొందఱు కలరు. వారిలో నొకనిఁజెప్పెద.

యయాతియను నొకమహారాజుండెను. ఆయన, దేవయానిశర్మిష్ఠలను వివాహమాడియుండెను. ఆతఁడు జనులను జక్కఁగాఁబరిపాలించె. అనేకయాగము లొనరించెను. లెక్కలేనిదానములఁ గావించెను. అంత గుమారునిబట్టాభిషిక్తునిఁజేసి వనమున కేగి నిరాహారుఁడై చాలఁగాలము తపమాచరించెను. ఈతఁడు చేయని సత్కార్యమింకొకటిలేదని చెప్పవచ్చు. ఇటుల మంచిపనులఁజేయుటవలన నీమహారాజునకు స్వర్గలోకము నివాసముగా లభించెను. అచ్చట నింద్రునిచే సత్కారముల నీమహారాజు పొందుచుండెను. అంత నాస్వర్గలోకమున కధిపతియగు దేవేంద్రునకు, నీమహారాజునకు, నీక్రిందివిధముగా సంవాదమాయెను.

ఇంద్రుఁడు—రాజా! నీవెట్టి న రాజ్యంబుఁ బరిపాలించితివి?

యయాతి—సుఖంబుగా ధర్మముగా రాజ్యంబుఁ బరిపాలించితిని.

ఇం—ఓరాజా! ఏమిటి పనుల్ జేసితివి? నీవిదివఱకే బ్రహ్మలోకసుఖంబనుభవించి యిచటికివచ్చినాఁడవు. సామాన్యమా? నీతపస్సుఁజూడ దుష్కరమైనదిగానున్నదే!

య—అవును. ఇంద్రా! దేవతలలోఁగాని మహామునులలోఁగాని యక్షులలోఁగాని రాక్షసులలోఁగాని నాతోఁస

మానముగాఁ దపమొనరించినవారు కానరారు. వారినందఱిని మించినదుష్కరతపము నేనాచరించి యుంటిని. నాకు నేనే యుపమానము.

ఇం—చాలుఁజాలు.నీగ్రంథముఁగట్టిపెట్టుము.నీతో సమానముగాఁ దపమొనరించినవారు మహామునులుగూడఁ గారుఁగా? ఏమిసీతపోభిమానము!. ఈయభిమానమువలన గొప్పవారల నవమానపఱచితివికదా. సరిసరి. నీవిఁకఁబుణ్యలోకంబున నుండఁదగినవాఁడవుకావు. సత్వరమే మనుష్యలోకమునకరుగుమని తఱిమివేసెను.

ఆలోకించితిరా! ఆయయాతిమహారాజు తానే మంచి రాజనియుఁ దానాచరించినతపమే మిన్నయనియుఁ దలఁచి దేవేంద్రునితో వినయములేక యహంకారముగా మునులుమొదలగుగొప్పవారల నవమానపఱచుచుఁ బలికినందునకదా సకలసుఖములకుఁ దల్లియిల్లగుస్వర్లోకంబునుండి దుఃఖముల కునికిపట్టగుమనుష్యలోకంబునకు వచ్చినది. కాన నెవఁడైనఁదానెంతగొప్పవాఁడైనను జననీజనకులసమక్షమునఁగాని గురువరాదిశ్రేష్ఠులయెదుటఁగాని ప్రభువులదరియందుఁగాని నిక్కుచు మాటలాడఁగూడదు. మఱియు వారిసమీపమున మిక్కిలి వినయముకలిగి యుండవలెను. కపటవినయమున నటింపఁగూడదు. ఒకవేళ నటులనటించినను వివేకవంతులు తెలిసికొనఁగలరు. అతఱిఁగీడులు మూడఁగలవు. కాన మనము పిన్ననాఁటనుండి యీకపటము లేని యడఁకువ నభ్యసించుచుం

డినఁ గ్రమక్రమముగాఁ జక్కఁగాఁ బట్టుఁబడును. కాని పెద్ద వారమైనతరువాత వినయమభ్యసింపవలయుననిన నంతగాఁ బట్టుపడదు. "చెట్టైయొంగనిది మ్రానై యొంగునా?" కాన మన మీబాల్యదశనుండియే వినయమభ్యసించుదము. అటుల నభ్యాసమొనర్చినయెడల సకలసంపదలు మనలఁజేరనపేక్షించుచుండును.

క. వినయమె కీర్తినిచ్చును
వినయమె ప్రథులాభములను వేగమె కూర్చున్
వినయమె జగమున సన్నుతిఁ
గనుగొనగాఁ జేయుఁగానఁ గ.

## సహవాసము

సహవాసమనఁగాఁ గూడియుండుట. అనఁగా నొకనితో నొకఁడు కలిసియుండుటయే.

ఈసహవాసమువలనఁ గీర్తియు, నపకీర్తియు, లాభము, నష్టము, మంచి, చెడ్డ, కష్టము, సుఖము, గౌరవము, పరిభవము. మొదలగునవియన్నియు సంప్రాప్తించు. మనమెటువంటివారలతో సహవాసముఁజేసిన నట్టిగుణము లలవడును. అనఁగా మనముదుర్జనులతో సహవాసముఁజేసినయెడల నపకీర్తియు, నష్టముఁ, గష్టము, నవమానములోనగుచెడుగుణములుకలుగును. ఇఁకసజ్జనులతో సహవాసమొనర్చినఁ గీర్తియు

లాభము, సుఖము, గౌరవము, మున్నగువానినిఁ బొరయఁగలము. మనమితరునితో స్నేహమొనరించఁ దలఁచిన యెడల ముందుగా వానినడవడి, బుద్ధి,వీనినిగమనించి యవి మంచివై మనకన్న నెక్కువసుగుణములున్న,వానితోడఁ దప్పక చెలిమి చేయఁదగును. సమానముగానున్నను జేయవచ్చు. తక్కువ వానితోమాత్రము స్నేహము సేయఁగూడదు. జలము చవిటినేలలోఁబడిన నుప్పనీరగునటులఁ జెలిమిదుష్టులతోఁ జేసిన దుర్గుణములుకలుగును. ఉదకము మంచిరేవడినేలలోఁబడిన మంచినీరగునట్లు చెలిమిశిష్టులతోఁ జేసిన సద్గుణములు కలుగును.

మిక్కిలి బొక్కసముకలవాఁడు బీదవానితోఁ జెలిమిఁ జేయఁడు. అటులనె విద్యావంతుఁడు విద్యావిహీనునితో, రణశూరుఁడు భీరువుతో, నుదారుఁడు లుబ్ధునితో సహవాసముఁ జేయఁడు. ఇది లోకస్వాభావికము. మంచినీరుగలిగిన మహానదులు నిందాస్పదముగు క్షారజలమునుగలిగిన సముద్రమునఁ గలియుటవలనఁగదా యవికూడ క్షారజలముకలవియైనవి. అటులనే సత్పురుషులు దుర్జనులతో సహవాసముఁ జేసినకొలఁది దినముల కాకుమతులగుణములు వీరికిఁగూడఁ బట్టువడును. కాన దుర్జనసహవాసము గర్హ్యము.

ఇఁక మనుజునకుసజ్జనమైత్రిత్వముతో సమానమైనది వేఱొకటిమంచిది కానంబడదు. మఱియు దానితోసాటిగా సహవాసముఁజేయునదియు లేదు. మూఢుఁడు, మనము పాప

కర్మముల నెక్కువగాఁజేయుచుండిన నాసమయమునం దీసజ్జ
నమిత్రుఁడు వారిదరిఁజేరి వారిమనమునకుఁ బలుతెఱఁగుల
బోధఁజేసి యాపాపపుఁబనుల నుండి విముఖులనుగాఁ జేయుచుం
డును. పుణ్యకార్యములఁజేయఁ బ్రోత్సాహమొదవించుచుం
డును. వారిక్షేమమునకై యనేకవిధముల నాలోచించుచుం
డును. తప్పులనుదాఁచి యొప్పులను బ్రకటించుచుండును. వా
రెక్కువగా నుత్తలపాటుపొందుచున్నప్పుడీసన్మిత్రుఁడు తన
మిత్రులతోవచ్చి తనకుఁజేతనైనంతసహాయముఁజేసి మిత్రు
లచేఁ జేయించి వారిని సుఖభాగులుగాఁ జేయుచుండును.తమ
మిత్రులకెట్టివిపత్తులువచ్చినను వానికిభయపడి సహవాసముఁ
జాలించుకొనక సహాయముఁజేయువాఁడే సన్మిత్రుఁడు. సుజన
మైత్రి మొదటఁ గొలఁదిగానుండి క్రమముగావృద్ధిఁజెందును.
సుజనులుతాము ధనవంతులైనను విద్యావంతులైనను సుగు
ణములనేప్రధానములుగాఁ జేసికొని బీదవారలతోనైనను స
హవాసమొనర్పఁగలరు. వీరుసహవాసమొనరించినపిదప క్షీర
నీరన్యాయముగాఁ గలిసియుందురు. సుజనులు తమమిత్రులు
మొదట నుచ్ఛదశలోనుండి దైవవశమున నైచ్యపుదశకు వ
చ్చినను దానిని సరకుసేయక వారినిగౌరవించుచుందురు. కాఁ
బట్టియెఁ చెడి స్నేహితునింటికిఁ బోవద్దను లోకోక్తి నేఁడు
పుట్టినదికాదు.

ఇట్లులఁ దమమిత్రులు తక్కువవారని తలఁచక వారి
సుగుణములనే ముఖ్యములుగాఁజేకొని గౌరవించినవారు

పూర్వులలోఁ గొందఱు సుజనులుకలరు. వారిలో నొకనిఁ జెప్పెద.

కుచేలుఁడనునొకబ్రాహ్మణుఁ డుండెను. ఈతఁడు బాల్యమునఁ గాశిలో సాందీపులవారివద్ద శ్రీబలరామకృష్ణులతోడ విద్యాభ్యాసమొనరించెను. తదుపరి గొప్పవిద్వాంసుఁడాయెను. ఆసాందీపులవారిసమీపమునఁ జదివికొనినదినములనీబలరామకృష్ణకుచేలు రన్యోన్యమిత్రత్వముతో నుండిరి. అంతట వారివారి గృహములకుఁజనిరి.ఈకుచేలుఁడు మిక్కిలి పేదయైనను ధనాశచే యాచనకై తిరిగెడివాఁడుకాఁడు. భగవద్భక్తుఁడు. తనకున్నదానితో సంతోషమందెడివాఁడు. సద్గుణములుకలవాఁడు.ఈతఁడొకసతీమణినివివాహమాడెను.ఆమె వలనఁ గ్రమముగా సంతానమెక్కువగాఁ గనెను., కాని యీ కుచేలుఁ డీసంసారమునం దంతప్రీతిగానుండెడివాఁడుకాఁడు. అందువలన నింటిసమాచారముల విచారించకుండ నుండెడివాఁడు. అట్లు తన పెనిమిటియుండుటఁజూచి యాపిల్లలనూఱడించుచుఁ దానన్నముఁజాలించుకొనియైనను నాబిడ్డలకుఁ బెట్టుచుండెడిది. ఇటులఁ గొలఁదికాలమైనతరువాత నాపిల్లలు తమతల్లిని మంచిమంచిదుస్తులను, రుచ్యములగునాహారపదార్థములను దెచ్చియిమ్మని పలుతెఱఁగులబాధింపఁ జొచ్చిరి. అంతట నామె తనపిల్లలపోటుఁబడఁజాలక తపమునుజేసికొను భర్తసమీపమునకరిగి యిటులఁ బలికెను. "నాథా! మీరా తపమునుజేసికొనుచు నింటిచిగిలి సంటించుకొసక పోతిరి.

పిల్లలా ఇతరులబిడ్డలఁజూచి వారివలె మాకును జేయుఁడని నన్నుఁదంటాలు పెట్టుచుండిరి. దారిద్ర్యమా యమితముగా నున్నది. నేనా మీకుఁ జెప్పునంతదాననుగాక పోతిని. చెలిమియా మీకు శ్రీకృష్ణునితోడనయ్యె. కాన నా ర్తజనవత్సలుఁడగు నాకృష్ణునియనుగ్రహమున మనదారిద్ర్యమును బోఁగొట్టి న స్నిబాధలనుండి తప్పింపుఁ"డని దీనముగాఁ బ్రార్థించెను. అంతట నాకుచేలుఁడు తనసతియొక్క దీనస్వరమునువిని తప ముచాలించి "దారిద్ర్యముఁబాపుకొనుటకై భగవదవతార మును,నాబాల్యస్నేహితుఁడును నగు నాశ్రీకృష్ణునిసందర్శించి వచ్చెదను. రిక్తహస్తములతో నేగఁగూడదు. కాన పండో, పూవో, నీరో, యేదియోపుచ్చుకొనఁదగిన యొకవస్తువును దెచ్చి యి"మ్మని యడిగెను. అంత నామె వంతసమందుచు నటుకులనాతనిచినిఁగినయుత్తరీయపుఁగొంగునఁగట్టి ముడివే సెను. అంతట నతఁడటనుండి బైలుదేఱి యా శ్రీకృష్ణమూర్తి యింటిబహిర్ద్వారమును బ్రవేశించెను. అచటనుండు కావలి వాండ్రిందఱు చినిఁగినబట్టలఁగట్టి సన్నగానుండిన యాకుచే లునిఁజూచి పకపకనవ్వుచుండిరి. అత్తఱి లోన శ్రీకృష్ణుఁడు తనప్రియురాండ్రతో సరస సల్లాపములాడుచుఁ దూఁగుటు య్యెలపై నూఁగుచు సుఖంబుగానుండెడిసమయమున యా దృచ్ఛికముగాఁ దనబాల్యస్నేహితుఁడగుకుచేలునిఁ జూచెను. అంతటనుయ్యెలనుండిదిగి, యెదురేగియాతనినిగాఁగిలించుకొని చేయిపట్టుకొని తీసికొనివచ్చి యాయుయ్యెలపైఁగూర్చుండఁ

బెట్టి కుశలప్రశ్నములఁ జేసెను. అంత నాకుచేలుఁడు తనమన మున స్నేహితుఁడొనరించిన సపర్యకు సంతోషించి యానంద బాష్పములవిడిచెను. అంత నిద్దఱు తాము గురునిసమీపమున జరిపినసంగతులఁ జెప్పికొనుచుఁ గాలముగడపుచుండిరి. అంతఁ గృష్ణుఁడు తనస్నేహితుఁడు తనసమీపమున కెందులకువచ్చి నది తెలిసికొని "యాతనిమనోరథము సంపూర్ణముగా నెఱవే ఱుఁగాక" యని స్నేహవాత్సల్యమున "మిత్రమా! నెచ్చెలి నని నాకేమైన కానుకఁదెచ్చితివా" యని యడుగుచు నతని యుత్తరీయమును బులుకుచు నొకకొంగున నటుకులుండుటఁ జూచి ప్రీతితోఁ దానందునఁగొంచెముతీసికొని మిగిలినవి తనసతులకిచ్చెను. అంతట నాకుచేలునికభ్యంగనస్నానంబుఁ జేయించి మృష్టాన్నమిడి మంచిబట్టలనొసంగి యాతనిని బహుమానపూర్వకముగా వీడ్కొలిపెను.

పరికించితిరా! ఆశ్రీకృష్ణుఁడు సజ్జనుఁడగుటవలననెకదా యాకుచేలుఁడు బీదవాఁడనియుఁ దనతోసమానుఁడు కాడని యుఁ దలఁచక యెప్పుడో బాల్యమునఁజేసినస్నేహమునుమా త్రమే పురస్కరించుకొని యట్లాతనినిగౌరవించినది. ఆకుచే లుని నెంతసంతోషపెట్టెనో చూచితిరికదా! ఇటుల నతఁడా కుచేలునిసంతోషపెట్టుటకుఁ గారణమేమి? బాల్యస్నేహమే కదా. కాఁబట్టి స్నేహముతోసమానమైన దింకొకటి మంచిది లేదని చెప్పవచ్చును. అంతున సజ్జనసహవాసము ముఖ్యము. దుర్జనసహవాసము త్యాజ్యము. కావున మనము దుర్జనసహ

వాసమువిడనాడి సజ్జనసహవాసముఁజేసి సుఖములఁ గాంచు చుందము.

క. సత్యక్షమాదమంబులు
నిత్యపదంబునకు నెక్కు నిచ్చెన లవి సం
గత్యనుగతములు సత్సాం
గత్యం బమగాన ముఖ్య కార్యము సుండీ.

(భారతము.)

# భూతదయ.

ప్రాణులయందు గనికరముగానుండుట. లేక వానిని బాధఁబెట్టకుండ నుండుటయే భూతదయ యనఁబడు.

పైవిధమున నుండినవారలు కీర్తనీయులు. తదితరులు నిర్దయులు. కాన దూషణీయులు. కావున నీలోకమున నుండు ప్రతిపూరుషుఁడును దయఁదాల్చి యుండవలెను. "అహింసా పరమోధర్మః,, అనఁగా "నరుఁడితరుల బాధపెట్టకుండ నుండుటయే సర్వోత్కృష్టధర్మ, మని నయశాస్త్రము నొక్కిచెప్పు చున్నది. ఇటులఁ జెప్పుచుండినను దీనిని లక్ష్యము చేయక కొందఱు దురాత్ములితరులఁ బలు తెఱఁగుల హింసించు చునే యున్నారు. నిర్దయ యనునది దుష్టచిత్తునే వరించు చున్నది. నిర్దయగలిగిన యాకుమతి యితరులను హింసించు

టు కించుకయు శంకింపఁడు. క త్తి గొంతులనఱకుటకు సందే హించునా? ఇఁక దయయనునది సచ్చిత్తునే వరించుచున్నది. సత్పురుషుఁడు పరులను హింసించుటకు లాఁతిగా నసహ్యం చుకొనుచుండును. మేలిమిబంగారు మితరులను హింసించని యటులనే! కాఁబట్టి దుర్మార్గుఁడే నిర్దయుఁడాల్చి యితరులను హింసించుననియు, సన్మార్గుఁడీపనికిఁ జొరఁబడఁడనియు గు ర్తె ఱుఁగుఁడు. పండితుఁడైనను బలవంతుఁడైనను కూ్రరుఁడై యి తరుల హింసించుచున్న వారిని నాపనినుండి యథాశక్తిఁదొలఁ గింపఁ బ్రయత్నముఁ జేయవలెను. అట్టి ప్రయత్నముఁ జేయని చోఁ బాపభూయిష్ఠంబగు హింస నొవరించినవారి కేగతియో యామ్యగతియే వీరికిఁగూడఁ గలుగును. కాన మనము చూచు చుండఁగా నెవరైన నితరులను హింసించుచుండిన యెడల వా రిని నాపనినుండి తప్పింపవలయును. ఏనుఁగుయొక్క యడుగు న సకల జంతువులయొక్క పాదము లిముడినటుల నీయహింస యను ధర్మములో సమస్తధర్మము లిముడియున్నవి. కాన మ నుజులకిది యనుష్ఠేయంబె.

కొందఱుకుమతులు బలాభివృద్ధికై యజాదిమృగము లఁజంపి వానిమాంసమును మిక్కిలి మక్కువతో మెక్కుచుం దురు. ఇది కడునన్యాయము. ఏలయన? మనబలాభివృద్ధికై వానిమాంసమును మెక్కుచుంటిమని కుతుకం బందు చున్నా ముకాని నోరులేని యాపశువుల విషయమై విచారించక పోతి మి. వానినిఁ జంపుట కీనుమను లుద్యమించి నపుడు వానిమన

ము లెటులుండనచ్చును? ఈహింతకుల నెంత దూఱుచుందు ను? ఎంతదుఃఖించు చుండును? తెలియునా? తెలియనియెడ ల నీదృష్టాంతముసఁ దెలిసికొనుఁడు. మన మిత్రుల వలన నొక పేము బెత్తపు దెబ్బఁబడితిమని యనుకొనుఁడు. ఆదె బ్బ మనమాపడిన సమయమునందుఁ గొట్టినవారిని దూషించ క విడుచుచుంటిమా? ఆబెత్తపు దెబ్బవలనఁబడిన దద్దురుఁగాం చి "అబ్బా! అమ్మా!" యని యేడ్చుచుంటిమే? మఱియు మన లఁగొట్టినవారిని మనముఁజందుఁచుకొని మఁగుడఁదన్నక యూ రక పోనిచ్చెదమా? పోనియ్యము. మనమీకొంచెపు దెబ్బకే యీవిధమున నుండినపుడు నోరులేని యీపశువులు హింసప డుచుఁ దమ్ముఁ జంపెడివారల నేమియుఁ జేయఁజాలక స్వకీయ ప్రాణములఁ గోల్పోవుతఱి వానిమనము లెట్లుండ వచ్చునో? వానిబాధ యెంత పరిమితికలదో? యించుక యాలోచించుఁడు. మనము బలాభివృద్ధిఁ జేయువలయు ననిన శాకాదులు లేవా? ఘృతాదులు లేవా? కాఁబట్టి మనము నోరులేని పశువులఁజం పుట మాని మనబలము నభివృద్ధిఁ జేసికొనుటకై శాకాదులను ఘృతాదులను బుచ్చుకొనవచ్చును. మన మాపశువులఁ జంపి నయెడల నొకవిధమగునష్టము మనకె కలుగుచున్నది. అదే దన? ఏసమయమునం దీపశువులఁజంపుచున్నామో యత్తిఱిఁ జలినాపెడి కంబళులుగాని బలాభివృద్ధిఁ జేసెడి నెయ్యిమొద లగునవిగాని వ్యవసాయాభివృద్ధి నొనరించు పెంటలు గాని లభింపనేరవు.

ప్రతిమనుజుఁడును తనవలెనే ప్రతిజీవుని ప్రాణవిషయ మందును సమానముగాఁ జూచుకొనవలెను. అనఁగాఁ "దనతల్లివలె నితరులభార్యలయందును, పరులధనములఁ బెంకుముక్కలుగాను, తనవలె సమస్త భూతములను నెవఁడు చూచుచున్నాఁడో వాడే పండితుఁ" డని నీతి శాస్త్రము ముద్ఘోషించుచున్నది. కాన మనమితరులవలన బాధఁబొందినపుడు మన కెంత యసహ్యముగానుండునో యటులనే యితరులకుఁగూడ నంత కష్టముగానుండునని తెలిసికొన్నుఁడు. మఱికొందఱు కుచరితులు తేనిపోని దేవతలపేరుఁబెట్టి యూ మృగములఁ గొట్టి యాక్షుద్రదేవతలముందఱఁ బెట్టి నివేదనముఁ బెట్టినట్టుచేసి తిరిగి ప్రసాదమని స్వీకరించి వాని మాంసమును దిట్టముగఁ దిని పొట్ట నింపుకొనెదరు. ఇది యేమో మహాభక్తియని వీరియభిప్రాయము. కాని యదిరిక్తయనినమ్ముఁడు. మఱియు వారికిఁ బాపముకూడఁ గలదని తెలిసికొనుఁడు.

ఈ జీవహింస కొన్ని సమయములందు దోషముకలదికాదని పండితప్రకాండులుపలికిరి. ఆసమయములేవియనినఃశ్రుతిస్మృత్యుక్త యజ్ఞాదిక్రతువులందు మాత్రము విధివిహితముగా జీవహింసఁజేసిన నది దోషయుతముకాదని చెప్పిరి. ఈయాధారమువలనఁ బ్రతిదేవతాకార్యమునందు జీవహింస చేయవచ్చునని తలఁచెదరేమో? అటులఁదలచుటకు వీలులేదు. ఆ యజ్ఞము శారీర శాస్త్రజ్ఞుల నిమిత్తమై యేర్పఱుపఁ బడినది. మఱియు సలిలముఁ బుచ్చుకొనునపుడు, కట్టెలఁగాల్చునపు

డు' భూమిని దున్ను నపుడు, నింక నిట్టి సమయములందు జీవ హింస జరుగుచుండును. అట్టిసమయములందు మన మేమియుఁ జేయఁజాలము. కాఁబట్టి పైనఁదెలిపిన సమయము లందుఁ ద ప్పఁ దక్కినసమయములందుఁ బ్రాణులను హింసించినయెడల వారు రోషభీషణమూర్తియగు కృతాంతుని లోకమున వచిం చరాని పలువిధములగు బాధలను నిక్కముగాఁ బొందుదురు. ఇందుకు డెందమందున సందియమావంతయు నందవలసిన య వసరము లేదు. మన మహింసను జేయు నరోత్తములను గౌరవించ వలెను. ఆహింసఁ దామొనరించి యితరులకు బోధించినవారు శాశ్వతంబును, జన్మరహితంబును. నానంద దాయకమును, నగు పదవినిఁబొందఁ గలరు. అట్టివారు లోకపూజ్యులు కాఁ గలరు. అటుల లోకపూజ్యతనందిన వారలలో నొకనినిఁ జూ పించు చున్నాను.

బుద్ధుఁడను మహానుభావుఁడు సకలజను లజ్ఞానాంధకార మునఁబడి గుడ్డివారై తన్నుకొనులాడుచుండ వారికిఁ దగిన యుపదేశములొనరించి హింసాభూయిష్ఠంబగు కార్యంబులనుం డితిప్పి "అహింసా పరమో ధర్మః" అనువాక్యములోనగు వా నినిఁజెప్పి జ్ఞానమను వెలుఁగునకుఁ దీసికొనివచ్చి యానందము కలవారినిగాఁ జేసెను. తానహింసనాచరించి యితరులచేఁ జేయించువాఁడు మహనీయుఁడుకదా. కాఁబట్టియె యీబుద్ధుఁ డు బోధించినబోధలనన్నిఁటిని జనులువిని యతఁడు సన్మార్గ

గామి యాటచే నాతనిమార్గ మవలంబించిరి. ఆజనులచేత నీ బుద్ధుఁడు విశేషముగా గౌరవింపఁ బడుచున్నాఁడు.

కాఁబట్టి యహింసఁ జేయువాఁడు పూజ్యుఁడనఁబరఁగు. చెప్పువారలు చాలమందియుందురుగాని యాచరించువారలు కడునరుదు. దూరమందుండి బావిలో "దూకుదూకు" మనువారలుందురుకాని తాము ముందుదూకి యటుపిమ్మట ననువారలుండరుకదా. కాఁబట్టి మనమహింసనుజేయుచు నితరులకది బోధించవలెను. నరుఁడు జన్మమెత్తినతరువాతఁ గారుణ్యము లేక యుండఁగూడదు. మనమితరులబాధఁదొలఁగించిన యెడల మనబాధల భగవంతుఁడు తొలఁగించు చుండును. సజ్జనులు ప్రతిఫలముకోరకయే యితరులసిలుగులఁబాపు చుందురు. ఎక్కువగా శరీరమంతటఁ జెమటలుపోసి నపుడు కమ్మతెమ్మెరలు చల్లఁగా నా చెమటలారిపోవునటుల వీచుచుండును. అట్లు వీచు చున్న గాలికి మన మేమిప్రతిఫలముఁ జూపించు చున్నాము? ఏమియు లేదుకదా. ఇఁకఁ గొందఱు దుర్మతులు ఫలమును గోరకయే యితరులకేదోవిధమున హింసఁగలిగించుచుందురు. ఇంగల మించుకయుఁగొంకక జనులసదనముల భగ్గుభగ్గుమని కాల్చుటలేదా? ఆయగ్నికి నిటులఁగాల్చుటవలన నేమిలాభమో తెలియరాకున్నది. కాఁబట్టి వారివారినైజమని తెలిసికొనవలసియున్నది. సజ్జనులు వీరువారనియనక వారికిఁదమసహాయముగావలసియున్న యెడల దగ్గఱఁజేర్చి సాయముఁజేసి వారిపీడఁబోగొట్టుచుందురు. మామిడిచెట్లు చిలుకలను, గోకి

లలను, రానిచ్చి తదితరములగు కాకులు మొదలగువానినిరా
నియ్యకపోవుట మనము చూచితిమా? చూడలేదుకదా!
కాన మనలఁగోరకపోయినను నితరులు బాధపడుచుండినట్టు
ల మనముకాంచినతోడనే దయతో యథాశక్తి వారిబాధ
తొలఁగు నుపాయమాలోచించి సౌఖ్యముగలవారినిగాఁ జే
యవలెను.

వేదచోదితమగు హింసనుగూడఁ గొన్నిస్మృతులు నిషే
ధించుచున్నవి. ఆనిషేధముననుసరించియే రామానుజులువా
రును, ఆనందతీర్థులవారును, వారివారిమతము నవలంబించిన
వారికి యజ్ఞాదులయందుఁగూడఁ బశుహింసలేకుండ శాసించి
యున్నారు. దీనింబట్టి యహింసకన్న నుత్తమమగుయజ్ఞయా
గాదులుకూడఁ గానరావని తెలియవలసియున్నది. వీరుయజ్ఞ
యాగాదులందుండెడి హింసనుగూడ నిరసించుటవలన నహిం
సయే యుత్కృష్టధర్మమని తెల్లమగుచున్నది.

కాఁబట్టి యిట్టియహింసను పైవిధమునఁ బల్కినపగిది
విధిసమయములందుఁ దప్ప నహింసయనుదాని నవలంబించి
యింకనితరులెవరైన హింసించుచున్నట్లుండిన వారిని నాహిం
సనుండి తగిన సద్బోధఁజేసి తప్పించి వారిచేఁగూడ దీనినను
ష్ఠింపఁజేయవలయును. మనము ప్రతిభూతమునందు దయగా
నుండవలెను. ఇటులు మనముండుటవలన మన మనేకలాభ
ములఁ బొందఁగలము.

ఆ. వె. దంతియడుగులోనఁ దక్కిన జంతుచ
యంబునడుగులెల్ల నడఁగియుండు
నట్ల ధర్మకోటు లన్నియులోనగు
నధిగుణ యహింస కింత నిజము.

(భారతము.)

# ధైర్యము.

ధైర్యమనఁగా నాపదలవలన వికారము నొందకుండ కార్యోత్సాహముకలిగియుండుట.

ఇది, మనోధైర్యమనియు, దేహబలముకలిగినందు వలనఁ గలుగు ధైర్యమనియు రెండువిధములనుండును. ఈధైర్యమొక కార్యము సాధించుటయందుఁగాని పౌరుషమునందుఁగాని యొకబలవంతునియాశ్రయమువలనఁగాని జనించుచుండును. ఈధైర్యము కలిగినవారిని ధీరులని వచించెదరు. వీరలె కార్యసాధకులు. ఈధీరులు తాముదైవవశమున నొకానొకప్పుడు పలుకడగండ్లఁ జిక్కినను వానినెంతమాత్రము లక్ష్యముంచక తమపనినే కొనసాగించుకొన యత్నించుచుందురు. కాఁబట్టి ధీరులెప్పుడైన నెన్నిదుఃఖములుకలవారైన నవి యితరుల కగుపఱచకుండ నుందురు. ధీరులు వానలఁదడసినను, నెండఁ గ్రాగినను సరకుసేయక కార్యముసాధించుచుందురు.

ఈధీరులు మెత్తని పరుపులను, కఱకు నేలలను, పంచభక్ష్య పరమాన్నంబును, కందమూలఫలాహారంబును, జీనిచీనాంబ రములను, జీర్ణాంబరములను, లాభనష్టములను, గీర్త్యపకీర్తు లను, సుఖదుఃఖములను, నుద్యానవనవిహారంబును, దుర్గమ కాననాంతరపరిభ్రమణంబును, మొదలగువానినన్నింటిని స మములుగానెంచి సమయానుకూలముగా నడచుచు నితరుల మనములనొప్పించక కార్యములసాధించుచు లోకమునకు మే లుఁజేయుచుందురు. ధీరులు తాముపూనినపని కెన్నియాతం కములువచ్చినను నవియన్నియు లక్ష్యముచేయక యాకార్య మును నెఱవేర్చుకొనుచుందురు. తమతప్పు లొరులెఱుంగకుం డునట్టుఁ జేసికొను చుందురు. ధైర్యము కలవాని నెట్టివిపత్తు లైన బాధింపఁ జాలవు. లోకమున ధైర్యములేక పరుగెత్తు చుండుమబ్బులను గాలిపాఱఁదోలునుగాని ధైర్యమూని పరు గిడక డీకొనసిద్ధముగానుండు ధరాధరములఁ బాఱఁదోలలే దుకదా. కాఁబట్టి ధైర్యవంతుని నెవరును బాధింపఁజాలరు. ధై ర్యమవలంబించనిది యేకార్యమును జేయఁజాలము. చూడుఁడు. ఒకఁడులోకోపకారము సేయనెంచి యొకమహానదినిఁగాంచి దీనియుదకము జనులకందఁ జేయవలయుననుతలంపున దాని కొకదరివేయ నుద్యుక్తుఁడాయెను. కాని యాతఁడు ధైర్యవం తుఁడుకాకపోవుటవలనఁ బ్రతిప్రదేశమునకువచ్చి యొడ్డున నిలువఁబడి యిక్కడ నెంతలోతుకలదోయని భయపడుచుఁ దానూనినపనిఁ గొనసాగించకొనలేకపోయెను. వాఁడే ధీరుఁ

డైనమొదల ధైర్యముఁగైకొని యేదియోయొకప్రదేశమున వదిలోనికిదిగి యెంతలోతుకలదో యాసంగతిఁదెలిసికొని యొడ్డువేసి జనులకుపకారముఁజేయకుందునా? కాఁబట్టి ప్రతి కార్యమునకును ధైర్యముకావలెను. ధీరత్వముకలవాఁడు సంపదలఁబొందినను, డిందినను, గొప్పవారలు దూషించినను, భూషించినను, కీడులుసంభవించినను, సంభవింపకపోయినను, దుదకుఁ దనకుమరణముతటస్థించుసమయమువచ్చినను తబ్బిబ్బుపడక ధైర్యమవలంబించి యాకష్టములదాఁటు నుపాయమును యోజించుచుండును. జనులు సామాన్యముగా నాధీరునిఁ జూచిన నాతనికేలోటునులేదు. ఇంకను మనము నిర్లక్ష్యముగాఁ జూచినంతమాత్రమున వానిధీరత్వమెచటికేగును? నిప్పును దలక్రిందుగానుంచినను దానిసెగలు పైకెఁగదావ్యాపించును. ధీరత్వముచేతవచ్చుయోగ్యత యింకొకదానిచేతరాదు. ధీరులు విఘ్నములకు భీతిఁజెందక పనిఁ బ్రారంభించి నడుమ విడువకుండ నాపనిని గొనసాఁగించుకొందురు. దాన విశేష కీర్తిఁ జెందఁగలరు.

అట్టుకీర్తిఁజెందినవారును బూర్వమందునఁగలరు. అందునఁ గొందఱసంగతిఁ దెలయఁబఱచెద.

మున్ను సురాసురలు ధైర్యమవలంబించి ఘోర గభీరమగు సముద్రమధ్యమందు మందర పర్వతమును దఱచిన మొదట నాసంద్రమునఁ బెరుఁగు రత్నములు, మొదలగుమంచివి జనించినవని సంతోషించి తృప్తిం జెంది యూరకుండిరా?

తమపరి పాణోపద్రవకరమగు విషము మొదలగు చెడ్డవి పుట్టినప్పుడు వానికి భయపడి మిన్నకుండిరా? మంచివి పుట్టినవని భయపడి యూరుకొనలేదు. విషముమున్నగు చెడ్డవిపుట్టిననని భయపడి యూరుకొనలేదు. ఇంక వారెప్పు డూరుకొనిరన? తాము సాధించఁదలఁచుకొన్న యమృతము పుట్టిన తరువాతఁ దృప్తిఁజెంది పనిఁజాలించిరి.

కాఁబట్టి యెట్టి కాలమందైనను ధీరులు అటంకములకు భయపడక నడుమనడుమ స్వాభావికముగాఁ గలుగు సుఖదుఃఖములఁ బాటింపక తాముపూనుకొనిన కార్యమును సాధించి తీరుదురు. కావున మనము మంచి పనులయందు ధైర్యమూని యవిశ్రాంతుగాఁ బ్రయోజన మందువఱకును నడుమఁ గలుగు సుఖదుఃఖముల నరకుసేయక "యెన్నిదినముల కీకార్యము నెఱవేఱదే,, యని విసుఁగుకొని విడువకయుండి యాకార్య ఫలములనంది సుఖమును బొందుదము.

క. ధృతి యారోగ్యము నొసఁగును
ధృతియుజ్జ్వలలక్ష్మిఁ దెచ్చు ధృతి కీర్తినము
న్నతిఁజేయుఁ గాలగత్యవ
గతి గలిగినఁ గలుగు ధృతి వికారవిదూరా!

(భారతము)

—•—

# పరోపకారము.

ఇతరులకు మేలుఁజేయుట పరోపకార మనఁబడు.

పరోపకారముఁ జేయువారలఁ బరోపకారులని పలికె దరు. ఈపరోపకారులు తాము కష్టముల ననుభవించు చుండి నను దీనులయొక్క బాధలఁబోగొట్టి వారికి సౌఖ్యముఁ జేకూర్చుచుందురు. వృక్షములు నిండువేసవినిఁ దామూఖరకరకిరణ నికరములచేఁ గ్రాగుచున్న మిసిమిసి యెండలో మలమల మాఁడుచు వచ్చిన పథికునిఁ జేరఁదీసి నీడనొసంగి వానిసంతాపమును హరించుటలేదా? సజ్జనులితరులచేఁ దామపకార మధికముగా నందినను వారు పరులకుమాత్ర ముపకారముఁ జేయుచుందురు. దుర్జను లితరులచేఁ దా ముపకారముల నెక్కువగాఁ బొందియును దిరిగి యాయుపకారుల కపకారములనే కూర్చు చుందురు. త్రాలచే ఉవ్విళ్లను గినియక రసాల సాలములు మనకుఁబండ్లనిచ్చుటయు, మరణావస్థలోనుండెడి పామును దీసికొనివచ్చి తగిన యుపచారము లొనరించి దానిపీడఁ దొలఁగించి పాలనుబోసి దానిఁజక్కఁగాఁ బెంచినను నది మనలఁ గఱవక విడువకుండుటయు మనకుఁ బ్రత్యక్షంబే కదా? దుర్మార్గుఁడు పరులచేఁ దానుబాధఁ బొందుచున్నను నితరులకుఁ గీడొనరించు పనియందు యోచించుచుండును. మండూకము పాము నోటిలో నుండియుఁ బ్రక్కన నీఁగలున్న వానిని భక్షించుటకై యత్నించు చుండునుగదా?

సుజనులు తమసుఖములనైన విడిచి పరులకుపకార మొనరించు చుందురు. ఎవఁడు తన శరీరమును, బుద్ధిని, ధనమును, బరోపకారమునకై యుపయోగించు చున్నాఁడో వాఁడే వంద్యుఁడు. వాఁడే స్వార్థపరత్యాగి. పరానుగ్రహ తత్పరులకుఁ బరుల కుపకారమొనరించుట చిత్రమైన విషయముకాక స్వాభావికమగుచున్నది. సుజనుఁడు జన్మించుట పరోపకారార్థమేకదా. చందనతరువులు స్వదేహశైత్యార్థమై జనించక పరుల సంతాపమును హరించుటకై జన్మించినవి కదా. మనము మనశరీరాదులనెటుల జాగ్రత్తతో నెంతప్రేమతోఁ జూచు చుండెదమో యటులనే యితరులయందును గాంచు చుండవలెను. కృషికుఁడు ఱాయి, అప్ప. మొదలగువానిని దీసి పాఱవైచి యనవసరముగాఁ బ్రయత్నములేకయే మొలిచిన ప్రయోజనములేని చెట్టు చేమలను బెరికివైచి చక్కగా నాగలిచే భూమినిదున్ని విత్తులుచల్లి వానకై మేఘావలోకనముఁ జేయుచుండును. అత్తఱి మేఘుఁ డీదీనకృషికునియొక్క పాట్లనెఱిఁగి జాలినంది వర్షముఁగురిపించిన నాభూయజమానుఁడు సంతసమంది యుపకారియగు మేఘునిఁ గీర్తించుచుండునుకదా. అటులనే మనసహాయముఁగోరువారలకు సహాయముఁ జేసితీరవలయును. మఱియు నితరులు మనలఁగోరకపూర్వమే బాధాపీడితుల కుపకారమొనరించుట సర్వోత్తమమైనది. దీనివలన నుపకారమందినవా రధికముగా హర్షమందుచుందురు. ఎటులన? ఎండవేళను మనమొక గ్రామమునకు

వెళ్ళి తిరిగివచ్చుచుండఁగ నెండ వడఁ దాఁకుచుండినపుడు దాహమైనయెడలఁ జెంతనే యొకనదికాని యొకతటాకముకాని లేక యొక మడుగుకాని యున్న నది మన దాహమార్పి యెండ వేఁడిమినంతయుఁ బోఁగొట్టిన మనము హర్షమందుచుండుటలేదా? ఆనదుల నిటులఁ జేయుమని యెవరుకోరిరి? కోరకపోయిన నావిధమున నుపకారముఁ జేయుటవలనఁగాదె? నదులు జలాశయములు పరోపకారమునకై జనించినవని చెప్పుదురు. నభోమణి తనకిరణములచేఁ బద్మములను వికసింపఁజేయుచుండును. నిశామనోహరుఁ డుత్పలముల వికసింపఁజేసి వానినానంద భరితములనుగాఁ జేయుచుండును. అటులనే సజ్జనులు తమప్రజ్ఞానాదుల నితరుల యుపకారముకొఱకై యుపయోగించుచుందురు. సుమతులు స్వకీయమగు కార్యమును విడిచిపెట్టి యితరులకుపకారముఁ జేయుటకై యెక్కువ ప్రయత్నముఁ జేయుచుందురు. సామాన్యులు తమకార్యము నెఱవేర్చుకొనుచు నితరులకుపకారముఁ జేయుచుందురు. నీచులు తమకు లాభమువచ్చునటులఁ గానుపించిన తత్క్షణమే యితరులలాభములఁ బోఁగొట్టుచుందురు. ఇఁక నింతకంటె నికృష్టులు తమకెంతమాత్రము ప్రయోజనము లేకపోయినను నితరులఫలముల నాశముఁ జేయుచుందురు. కాన మనము మనశక్తికొలఁది సుచరితులుచేయు మార్గము నవలంబించుట కుద్యమించుచుండవలెను. శరీరమునకుఁ జందనాది సుగంధ ద్రవ్యముల నెన్నిఁటిఁ బూసికొనినను నెన్ని భూషణములఁ బెట్టికొనిన నాశ

రీరము ప్రకాశించనేరదు. కాని పరోపకారముచేత నది ప్రకాశించఁగలదు. అనఁగా మనుజునకుఁ బరోపకారముఁ జేయుట పరమార్థమని ముఖ్యాభిప్రాయము.

మనము సతతము పరోపకారముఁజేయుచుండినఁ గీర్తివంతులము కాఁగలము.

ఈవిధముగాఁ బరోపకారమునఁ గీర్తిఁ జెందిన వారలలో నొకరినిఁ జూపించు చున్నాను.

మున్ను కుంతీదేవి తనసుతులతో నేకశిలానగరంబున నొక బ్రాహ్మణునిగృహంబునఁ గారణాంతరమునఁ గాఁపురముఁజేయుచుండెను. ఇటులుండ నొకదినమునఁ దాము నివసించు గృహమున నాగృహయజమానుఁడు మొదలగువా రేడ్చుచుండిరి. ఇదియేమి? ఈరోదన మెచ్చటిదని విస్మయంబందుచుఁ గుంతీదేవి యేడ్చెడివారలవద్దకు వచ్చెను. తరువాత నీకుంతీదేవి వారలను "మీ రేలఁగాకిగోలగా నేడ్చుచున్నారు? మీ కేమియాపద గలిగెను? దానినిపుడే పోఁగొట్టి సుఖులనుగా మిమ్ముఁ జేయఁగలను. కానఁ గారణములఁ దెలియఁబరచుఁ" డని యడిగెను అంతట నాగృహయజమానుఁ డామెతో "అమ్మా! ఈగ్రామమున "బకుం" డను రక్కసుండొకఁడు గలఁడు. వాఁడు ప్రతిదిన మొక్కొక్క యింటిలోఁజొచ్చి యానికేతనమున నుండు వారలనందఱిని జంపి తినుచుండెడివాఁడు. వానిని నిర్జించుటకు మాపురవాసులకుఁ గాని మారాజులకుఁగాని శక్తిలేకపోయెను. అంతటఁ బౌరు లారక్కసుని

తోఁ "బ్రతిదినమిలువరుస రెండెనుబోతులను, బండెఁడు రక్త మాంస మిశ్రితాన్నమును, నొకమానిసినిదెచ్చి నీకియ్యఁగలము. కాన స్వేచ్ఛగా జనులఁజంపుట దయచేసి మానుకొనుమని మనవిఁ జేసికొనిరి. ఆరక్కసుఁడందుల కంగీక రించెను. ఆయేర్పాటుప్రకార మిలువరుస జరుగుచువచ్చినది. నేఁటికాయేర్పాటు మాయింటికిఁగూడ సిద్ధమాయెను. మాయింటిలో నాభార్యయుఁ, గొమరితె, కొమరుఁడు, నేను, నలుగురము గలము. కాని యొకరి నొకరు విడిచిపెట్టలేక గగ్గోలుగా నీవిధమున నేడ్చుచుంటి" మని చెప్పెను. అంతఁ గుంతీదేవి వీరియవస్థంగని పరోపకార పారీణురాలు గనుక వారు కోరకపోయినను వారితో "మీరు దుఃఖింపకుఁడు. నాకైదుగురు కొమరులుగలరు. అందున రెండవకుమారుఁ డారక్కసున కాహారముగాఁబోఁగలఁ,, డని వచించెను. అంతట నా యజమానుఁడు చెవులుమూసుకొని "రామరామ మాయింటి కతిథులుగా వచ్చిన మిమ్ములను స్వకీయప్రాణ సంరక్షణార్థమై రక్కసుని కాహారంబుగాఁ బంపించుట పాటియే? పాడివిడిచి మీరుచెప్పిన విధమున నేనొనరించిన నాకు సత్కీర్తి లభించునా? లభించదు. కాన దాని నేవిననొల్ల,, నని యామెతో ననెను.

అంతఁ గుంతి "అయ్యా! మీయవస్థఁజూడలేక నా రెండవ కుమారుని మీకుమాఱునిగాఁ బంపెదనంటిని. నాకుమారుని భక్షించుట కారక్కసునికి వశముకాదు. ఈకుమారుఁ డిదివఱకే మహాబలవంతు లనేకులఁ జంపినవాఁడు. వీనినిఁగూడఁ

జంపి మీకుపకారమొనరించఁగలఁడని చెప్పి మీరెంతమాత్ర మును విచారించకుఁ" డని దృఢముగాఁబలికి తనకుమారుఁడగు భీమునిఁబిలిచి సంగతులన్నియుఁ జెప్పి వీరిదుఃఖమును బాపుమని చెప్పి రెండెనుబోతులను, బండెఁడు రక్తమాంసమిశ్రితాన్నమును నిప్పించి యాభీముని రక్కసుని వద్దకుఁ బంపించెను. అంతట నాభీముఁ డారక్కసున కించుకంత దూరమున నిలువఁబడి యాబండినినున్న యన్నమును దిట్టముగాఁ దినుచు "రమ్ము ర" మ్మని కేకలు వేయుచుండెను. దానినిగాంచి యారక్కసుఁడు "వీఁడెవఁడో కాని నాయెదుటకువచ్చి నాకై తెచ్చిన యన్నమునుదినుచు నిర్లక్ష్యముగాఁ గేకలు వేయుచున్నాఁ" డని తలఁచి కనుల రవరవలు రాలునట్లు జంపునంత వేగముతో నాభీమునిపై దడాలునఁ బడెను. అంతట నాభీమునికి నీరక్కసునకుఁ గొలఁదికాలము యుద్ధముజరిగెను. అంతట భీమాకారుండగు భీముం డారక్కసుని కటి కంఠ ప్రదేశములఁ బట్టికొని యొకగుద్దుగుద్దెను. దానికిఁ దాళలేక యారక్కసుఁడు మృతినందెను. అంత భీముఁ డారక్కసుని శవమునుదీసికొనివచ్చి పురజనులకుఁ జూపించెను. తరువాతఁ బౌరులీభీమునికి, నీతని తల్లియగు కుంతికి, నామెకుమారులకుఁ బిండివంటలఁ జేయుచు విందులనొనరించుచు వచ్చిరి. తు[illegible] భీముని కుత్సవంబుసల్పి "పరోపకారివై మాబా[illegible] డని కొనియాడిరి.

కంటిరా? ఆకుంతీదేవి రా[illegible]ంబుగాఁ దన రెండవకుమారునిఁ బంపెనుగదా? ఆభీముఁడు తనతల్లియను

మఱిని నారకాసునిఁ జంపి యాపురవాసుల కెంత యుపకార మొనర్చెనో, యెంతసుఖముఁ గూర్చెనో, తెలిసినదికదా? కాఁబట్టియే వారలు పరోపకార మందుఁ బ్రసిద్ధికెక్కియున్న వారలు. కావున మనల నితరులు కోరినను, గోరక పోయినను శక్తికొలఁది నుపకారమొనరించి శ్రేయస్కరముగానుందము.

ఆ. వె. పరుల కుపకరింపఁ బాపక్షయంబగు
పరుల కుపకరింపఁ బట్టుకొమ్మ
పరుల కుపకరింపఁ బరలోకసాధన
పరుల కుపకరింపఁ బలిమి వేను!॥

---

## కృతజ్ఞత.

---

చేయఁబడినమేలు నెఱిఁగియుండుట కృతజ్ఞత యనఁబడు. అనఁగాఁ దానితరులచేఁబొందినమేలును మఱువకుండ నుండుటయే!

ఈకృతజ్ఞత కలిగినవారలు కృతజ్ఞులని పల్కబడుదురు. ఈకృతజ్ఞులె కృతార్థులని చెప్పనగు.వీర లితరులచే నింతకుమున్ను పొందిన లాభము లేకాక యింకను లాభములఁబొందుచుందురు. కాని "ఫలానా,, వానివలన నాపని కొనసాగినదని తలఁచుచు నాయుపకారిని నుతించుచు మఱుడ నతనికిఁదాను తగిన

సాయముఁ జేయుటకై యెక్కువ ప్రయత్న మొనరించు చుండ వలెను. ఇది కృతజ్ఞునికి ముఖ్యలక్షణము.

మన మొక కుక్కను దీసికొనివచ్చి దానికిఁ బ్రతిదినము మన మారగించఁగా మిగిలినయన్నమును బట్టెఁడు వేయుచుండిన నది గాఢాంధకారములోఁ గూడుకొను నమావాస్యా రాత్రులయందు నిద్ర విడనాడి యనిమిషత్వము నంది మన యింటిచుట్టును దిరుగుచు దొంగల రానీయక మనలను, మనధనాదులను, గాపాడుచుండును. మఱియు నాతస్కరులాగ్రహించి వచ్చినయెడల మనలను నిద్ర నుండి మేల్కాంచునటులఁజేసి మనలఁ దోడ్కొని యాచోరులమార్గమును మనకుఁ జూపించుచుండును. అప్పుడు మనమా దొంగలఁ బాఱఁద్రోల వచ్చునుగదా. ఈకుక్కయే లేనియెడల మనసంగతి యెటులుండునో? పట్టెఁడన్నమును వేయుచుండిన మనలను మఱవక మగుడ మనకు నెంతయుపకార మొనరించు చున్నదో కాంచితిరిగదా. కాఁబట్టియె విద్యావిశారదులగు నైఘంటికులు దానికిఁ గృతజ్ఞమని పేరిడిరి. కృతజ్ఞమనిన కుక్కయని యర్థము. తిర్యగ్జంతువగు నాకుక్క యటులఁ గృతజ్ఞతకలిగి క్రమ్మఱ సాయముఁ జేయుచుండగా నమూల్యంబగు బుద్ధిగల మనము కృతజ్ఞతగలవారమై యుండుట యొక చిత్రముకాదు కదా.

ఇతరునివలనఁ దాను మేలుఁ బొందినయెడల నది మఱియొక యతని కేదో యొక సమయమునందు సహాయముఁ జేసి తీరవలయును. తనకు సాయముఁ జేయుశక్తి లేనితఱి నాయుప

కాయల నెదనెల్లప్పుడు నుతించుచుండవలెను. ఇతరునిచేఁ దాఁ గొలఁది మేలుఁబొంది యాతనికన్న నభివృద్ధి దశకు వచ్చినను నా మేలుమఱవక సాయముఁ జేయుట మంచిది. కొబ్బరిచెట్టు పాదున మనము రెండు నెలలు లేక మూఁడు నెలలు మంచియుదకముఁ బోసి కాపాడిన నానారికేళవృక్షము క్రమక్రమముగాఁ బెద్దదై ఫలవంతమైన తరువాత వాని కాదిని రెండు నెలలుమాత్ర ముదకమిడి కాపాడిన మనలను మఱవక కృతజ్ఞత కలదై తన నెత్తిపై సంతాపహరంబును, నమృత తుల్యంబును, నగు జలముతోఁ గూడికొనిన ఫలములఁ బెట్టికొని తన జీవితాంతము వఱకు నిచ్చుచున్నది గదా. కాఁబట్టి యితరునిచేఁ గొంచెము లాభముఁబొందినను గృతజ్ఞత కలిగియుండవలెను. భగవంతుఁడు, గురువులు, రాజులు, తలిదండ్రులు మొదలగు వారిచే మేలుఁబొందనివాఁ డీ భూతలమున లేఁడు. కాన వీరలందుఁ గృతజ్ఞత కలిగి యుండవలెను. ఉపకారు లందుఁ గృతఘ్నతకలవారు కృతాంతానుగ్రహపాత్రులు. "కృతఘ్నత" యనఁగాఁ జేయఁబడిన మేలును మఱచుట. కృతజ్ఞుఁడై కృతముఖుఁడు కాఁగలఁడు. ఇటుల కృతజ్ఞత కలిగి తిరిగి తనకుఁ జేతనైనంత మేలొనరించి వారిఁ గాపాడిన వారలు పూర్వులలోఁ గలరు. వారిలో నొకనిఁ జెప్పెద.

శ్రీకృష్ణార్జును లగ్నిచే ఖాండవవనంబు దహనంబుఁ జేయించుచున్న సమయమున మయుఁడను వాఁడు రక్షణ సేయుమని ధనంజయుని మఱుఁగుఁజొర నాయర్జునుఁ డతనిని రక్షించెను. ఆ

నంగతి నీమయుఁడు మఱువక కృతజ్ఞతకలవాఁడై మురారితో
డ నర్జునుఁడు సుఖముగాఁ గూర్చున్న తఱి వచ్చి "స్వామీ!
నేను దానవ విశ్వకర్మను. శిల్పవిద్యా చమత్కృతియం దుత్తీ
ర్ణుఁడైన వాఁడను. కాన నాకు నాఁడు మేలొనరించిన మీకుఁ
దగినంతమేలుఁ జేయలేకపోయినను జేతనైనంత మేలుఁజేయు
టకై వచ్చితిని. కాన మీకిష్టమైనదానిని నిర్మించెద. ఆజ్ఞాపిం
పుఁ" డనెను.

అంత సంక్రందన నందనుఁడు నందనందనుఁజూచి యితని
నొక్క యపూర్వంబగుదానినిర్మింపనానతిండని పలికె.అంతఁ
గృష్ణుఁడు యోజించి మయునిఁజూచి "నీవు నీవిద్యాసామర్థ్యం
బు వినియోగించి యిట్టిదిదివఱకు లేదని యంద ఱద్భుతముఁ
జెందునటుల నొకసభ నిర్మించి తీసికొనివచ్చి ధర్మరాజున కొ
సంగు,,మని పలికెను. అటులనే మయుఁడు సరేయని చెప్పుచు
నింకను గదాదులను భీమాదులకుఁ దెచ్చియిచ్చెద నని పలికి
యనుజ్ఞఁగైకొని తనసదనమునకుఁ జనెను. తరువాత వాఁడు
మైనాకపర్వతమున కనతిదూరమునను౦డు బిందు సరోవరము
నుజేరి యందుండు రత్నాదులఁ గైగొని యింటికిఁజేరెను. అం
తట నాతఁడు తానుదెచ్చిన రత్నాదులనన్నిఁటిని నాసభయం
దుఁ జొన్పి యనిర్వాచ్యంబగు గాంతిచే ధగద్ధగాయమానం
బై ప్రకాశించుచుండునటులఁ బదివేలమూరలు గలిగి నిడివి
యును దానికిఁ దగినవెడల్పును, గలుగునట్లొకసభ నిర్మిం
చెను. దాని నెనిమిదివేల రక్కసులతో మోపించుకొని వచ్చి

ధర్మరాజునకిచ్చి గదాదులను భీమాదులకొసంగి ధర్మరాజుచే సత్కృతుండై చనెను. ఈసభను బోలుటకు దేవేంద్రాదిసభలును గొఱఁగావని నారదాది మహర్షులు వచించిరి.

కనుగొంటిరా! ఆమయునికృతజ్ఞత యెట్టిదో! మఱియు నెటుల నాయుపకారులకు మేలొనరించెనో! కావుననే యామయుఁడు కృతజ్ఞత యందునఁ బ్రసిద్ధిని నంది యున్నాఁడు. కాన మనముగూడఁ గృతజ్ఞతకలవారమై తిరిగి యుపకారులకు మేలొనరించుచుఁ గృతలక్షణులమగుటకుఁ బ్రయత్న మొనరించు చుందము.

క. కృతమెఱిఁగి కర్తనుత్తము
మతుల సభల సంస్తుతించి మఱవక తగ స
త్కృతి సేయుదె కృతమెఱిఁగెడు
పతియె జగజ్జనుల నెల్లఁ బరిపాలించున్.

(భారతము.)

---

# దా న ము.

---

అనఁగా నితరులకు ధనముఁగాని యుపయోగ మగు వస్తువుకాని యుచితముగా నొసంగుటయు, మఱియు నభయమిచ్చుటయు నని యెఱుఁగఁదగు.

ఈదాన మెక్కువగాఁజేయువారలు వదాన్యులని చెప్పఁబడుదురు. సామాన్యముగా దీనులై, యకుటిల స్వభావులై

మునదగ్గఱకు మంచియాచకులు వచ్చినయెడల వారికేమియు నియ్యక వ్యర్థముగా వెడలఁ గొట్టక సంభావించి యథాశక్తి దానమొసంగుట వివేకునిలక్షణము. తానాపదలఁ బొందుచున్నను ధర్మమునుమాత్రము విడనాడఁగూడదు. భయముకలవాఁడై శత్రువువచ్చి తన్నుశరణుఁ బొందినయెడల వానికభయదానం బొసంగి రక్షించవలయును. దానముఁ జేయునపుడు ప్రతివారును బాత్రాపాత్ర విచారణఁజేయుట ముఖ్యము. పాత్రమనిన యోగ్యము. అపాత్ర మనిన యోగ్యముకానిది. ఎటువంటి వారలకు దానమొసఁగ వలెనన? వేదములను, వేదాంగములను, జక్కఁగా సుస్వరముతోఁ బఠించినవారును, సకలశాస్త్రపఠనసమర్థులును, సగు నవధానులకును, సంస్కృత భాషనభ్యసించి సత్ప్రవర్తన కలిగినవారికిని, విద్యావిహీనులైనను సద్గుణులకును, గుటుంబము కలవారికిని దానమొసంగుట పరమార్థమనఁ జెల్లు. ఆఁకలిచే బాధపడుచు నన్నముఁబెట్టుమని మనకడకు వచ్చినవాఁ డేజాతివాఁడైనను వానికన్నదాన మొసరించుటయుఁ, కుంటివారలకు గ్రుడ్డివారల కన్నపానాదు లొసంగుటయుఁ బరమార్థమనఁ జెల్లు. ఈపైవారలకు దానముగా నొకవస్తువిచ్చినను నన్నమును బెట్టినను వారినినాపదనుండి రక్షించినను బ్రయోజనముకలదియగును. తదితరులకు దానమొసంగిన నిష్ప్రయోజనమ యగును. ఎటులన? పిసిని తనముగలిగిన యొకని కొక వస్త్ర మిచ్చితిమని యనుకొనుఁడు. వాఁడుమనమిచ్చిన వస్త్రమును దీసికొని

యాపణవీథికరిగి యమ్ముటకుఁ జూపును. కాన మనమట్టి వా
నికి దానముచేయరాదు. మనమొక ధనవంతునిఁబిలిచి సంభా
వించి పదిరూప్యములనిచ్చితిమని యనుకొన్నఁడు. వాఁడుతా
ధనవంతుఁడనని గర్వించుచు మనమిచ్చిన దానిని నిర్లక్ష్యము
చేయుచు నపహసించు చుండును. కాన ధనవంతులకు దాన
మొనరించఁ గూడదు. దురభిమానియగు నొకనిని విందునకుఁ
బిలిచిషడ్రసోపేతంబగు పరమాన్నంబుఁబెట్టితిమని యను కొ
నఁడు. వాఁడు మనమిడినవిందును నెందుకుఁ గొఱఁగాని దా
నిగా నొనరించుచుఁ దననెచ్చెలులవద్ద వదరుచుండును. కావున
దురభిమానులకు దానముఁగావించఁ గూడదు. వీరలకు దాన
మొసంగుట "నీటిలోనివ్రాఁతయె,, యని నమ్మఁడు. సుగుణ
ములతోఁగూడికొనిన బీదవారల కన్నమిడినను డబ్బు నిచ్చి
నను మరియేదానముఁజేసినను ఫలవంతమగును. తగినకాలము
నందుఁ జక్కనిపనిజేసిన నేదియైనను ఫలించును గదా. కాన
ధనికి, దురభిమానికి, వాచాటునకుఁ, గృద్ధునికి, లోభికి,దానము
ముమ్మాటికిని చేయఁగూడదు. మంచివారలకుఁ జేయుచుండ
వలెను.

ఇటుల దాన మొనరించుట మనుజులకేకాక సత్స్వభా
వముగల తిర్యగ్జంతువులకు దానముఁజేయవచ్చును. ఇదియుఁ
గూడ నుత్తమము. వీనికి దానముచేయుట యెట్లని? చీమలు
మొదలగు మంచిపురుగులకుఁ జక్కెరమున్నగు మధుర పదా
ర్థములఁ జల్లుచుండవలెను. పశువులకుఁబసుతాగునటులఁ దటా.

కము నొకదానినిఁ (దవ్వించి వానికాహారార్థమై గడ్డిమొదల గువాని నియ్యవలెను.పక్షులు,వసించుటకు గూళ్లనునిర్మించి యవితినుటకుఁదగినపదార్థముల నిచ్చుచుండ వలెను. సాధుస్వభావముగలిగినమృగములకుఁ దగిన యాహారపదార్థముల నిచ్చుచుండవలెను.ఇట్లు దానముఁజేయు వారల నుత్తములని చెప్పితీరవలయును.

మఱియు నేప్రాణి యైనను భయముకలిగి తన్నుశరణుఁజొచ్చినయడల యథాసామర్థ్యముగ నభయ మొసంగి రక్షించవలయును. ఇదియే వదాన్యుని లక్షణము.ఇదిలేని వాఁడు దాతకానేరడు.

యోగ్యుఁడు దానము నీఁదలఁచిన వానినినెవఁడు నా పలేఁడు హీనుఁడు.దానమీఁదలఁచియు నొకనిబోధకు లొంగి దానమియ్యక యాఁగిపోవును. వీఁడపకీర్తిపాలు కాఁగలఁడు. మఱియు లోకోపకారములగు దానములు కొన్నిగలవు.ఈదానములనొనరించినవారి నామములు బహుకాలము ప్రచారములో నుండఁగలవు.వీనివలనఁ బరలోక సౌఖ్యము కలుగును. కాన వాని నాచరించుటకుఁ బ్రయత్నించవలెను. ఆ దానములేవియనిన? విద్యార్థులు చదువు కొనుటకై విద్యాశాలలనిర్మించుట. చెఱువులఁద్రవ్వించుట. తోఁటలువేయించుట.సత్రములగట్టించుట. దేవాలయంబులఁ బ్రతిష్ఠించుట. వైద్యశాలల స్థాపించుట. పుస్తక పత్రికాపఠనశాలల నెలకొల్పుట. సత్క్రా

తిరంమును మొదలగునవి. వీనిని జేయుటకుఁ దమకుశక్తి లేని యెడలఁ జేతనైనంత సహాయముఁ జేయవలెను. వీరలు కీర్తి వంతులగుదురనుటకుఁ గించిత్తుకూడ సందియము లేదు.

మనకున్నదానిలోఁ గొంచెమిచ్చినను పేదయెక్కువగా నానందమందుననియు మనకున్నదానినంతయు నిచ్చినను ధన వంతుఁడా మోదమును జెందఁడనియు, నభయదానంబొసంగిన నేప్రాణియైనను సంతోషించుననియు మనము తెలిసికొనవల యును.

ఇటుల దానమొసంగి కీర్తిఁగాంచినవారలు మనపూర్వు లలోఁ జాలమంది కలరు. వారిలో నొకరిని జూపించుచున్నాను. సకలనీతివిశారదుఁడగు శిబియనురాజర్షి యజ్ఞంబమోఘంబు గాఁజేసినసర్వజనులకునుమృష్టాన్నమిడియథ్వర్యులు సంతోషిం చునటుల దక్షిణల నొసంగి చేయఁదగినదానంబులెన్నికలవో వాని నన్నిఁటిని యథావిధిగా నొనరించి లోకముచే "లోకో త్తర దాతృశిఖామణి" యని బిరుదమునంది యుండెను. ఈ సంగతి స్వర్గలోకంబున విని వెఱఁగంది యింద్రుఁడును, నగ్ని యు, నీతని గుణంబులఁ బరీక్షించుటకై తలంచిరి. తరువాత వారిద్దఱిలో నింద్రుఁడు డేగయై యనలుఁడు పావురమై బయ లుదేఱిరి. ఆడేగవలన నీపావురము భయమందుచున్నట్లు పరు గిడుచు ధర్మజ్ఞుఁడగు నాశిబి చక్రవర్తిని శరణుఁ జొచ్చెను. అటుతరువాత నాస్యేన మాకపోతమును దఱుముచు వచ్చు చుంట నాకపోత మాశిబి భూపరాజు సమీపమున నుండుట

గాంచి కర్తవ్యమేమియుతోఁచక యారాజుతో "రాజా! నీవు సకల ధర్మవేదివని వినియుంటిని. కానఁ బ్రస్తుత మాఁకలిచే మిక్కిలి బాధపడుచున్న నాకాహార విఘ్నము సేయఁదగునా? మఱియు "శ్యేనాః కపోతాన్ ఖాదయన్తి" అనఁగా "డేగలు పావురములను భక్షించు"నను వేదవాక్యాను సారంబుగా నాకాహారంబుగా నున్న దీపావురము. నాభార్యయు, బిల్లలు, నేను, నీ కపోతాహారములేనియెడల జీవించలేము. నీవొక జీవమును రక్షించుట కనేకజీవముల హింసఁబెట్టుట ధర్మవేనా?" యని యడిగెను. అంతనావదాన్యుఁడు "నీవు చెప్పిన దంతయు సత్యమే! కాని ప్రాణభయముచే వచ్చి రక్షించుమని కోరినది. ఇట్లాశ్రయించినదానిని వెడలఁగొట్టుట ధర్మమేనా? చెప్పు "మని యడుగుచు "నీవుపక్షివైనను ధర్మమెఱిఁగినటుల మాటలాడు చున్నావు. కాన నీకానసంబున నుండు మృగంబుల మాంసంబులఁదిని నీయాఁకలిని దీర్చుకొనుము. కాని యీకపోతముపై నిఁక నాశ విడువుము" అని పలికెను. అంత నాడేగ "రాజా! నేఁదినఁదగిన దిదియే. దీనిని రక్షించుటకు నీకిష్టమున్న నీమాంసంబు నాకాహారంబుగా నిమ్మని పల్కెను. వెంటనే యారాజు తనకత్తితోఁ దన శరీరమంతయుఁగోసి కోసి మాంసమంతయు నాడేగకాహారంబుగా నొసఁగెను. అంత నాడేగ పావురములారూపములవీడి తమనిజరూపములం దాల్చి యారాజుతో "మేము వాసవాగ్నులము. నీదానమునకు, నీధర్మబుద్ధికి మెచ్చితిమి. కాన నీకీర్తి

బ్రహ్మాదులున్నంతవఱకు ననశ్వరమై వృద్ధిఁ జెందుఁగాక, నీశరీరము యథాప్రకారముగా నుండుఁగాక, యని యాశీర్వదించి తిరోధానమైరి.

కాంచితిరా! ఆశిబిచక్రవర్తియొక్క దానము, ధర్మబుద్ధియు. ఆమహారాజార్తత్రాణ పరాయణ నిమిత్తమై తనశరీరమునుగూడ గోసియిచ్చెనుగదా. ఆహా! ఏమియాదానము! ఆయార్తత్రాణపరాయణత్వము. కాఁబట్టియే, వాసవాగ్నులు పరీక్షించి మెచ్చి యనేకవిధముల నాశీర్వదించిరి. సామాన్యులకిటులు గొప్పవారలదర్శనము కాఁగలదా? కాదు. కాన మనము మంచివారలకు దానముసేయుచు లోకోపకారములగుదానము లొనరించుటకుఁ బ్రయత్నముగావించుచు దీనులకభయదానంబొసంగి కాపాడుచు నెక్కువకీర్తిఁ గాంచుచుందము.

తే. చెల్లియుండియు సైరణంసేయు నతఁడు
పేదవడియును నర్థికిం బ్రియము తోడఁ
దనకుఁ గలభంగి నిచ్చువాఁడు, బుణ్య
పురుషులని చెప్పఁ బ్రాజ్ఞులుం గురువరేణ్య

(భారతము.)

---

# ముఖస్తుతి.

---

ముఖస్తుతియన నెదుట నిచ్చకపుముచ్చటలాడుట.

ఈముఖస్తుతివలె మోహముఁ జెందించున దింకొకటి లేదు. ఈముఖస్తుతివలన ననేకకష్టములఁ బొందఁగలము. ముఖస్తుతినొనరించువార లితరస్థలములయందుఁ బ్రవ్వఁదిట్టుచుందురు. కాన వీరిని మనదరికి రానీయఁగూడదు. రానిచ్చినను వారిచ్చకపుమాటలకు లొంగఁగూడదు. సామాన్యముగా నిటుల ముఖస్తుతిసేయువారలు తమకసాధ్యమగు నేదియో యొకగొప్పకార్యమును దలఁచుకొని వచ్చుచుందురు. ఆకోరిక యీడేఱువఱకు నటుల నుతించుచుందురు. అటుతరువాతఁ దూలనాడుట కుద్యమించుచుందురు. ముఖస్తుతిసేయువారలందఱు మోసగాండ్రనవచ్చును. కారణమేమన మనదగ్గఱ సకలజనమనోజ్ఞమగునొకపదార్థమున్నదని యనుకొనుఁడు. దానిని దాఁజేయు ముఖస్తుతివలన నపహరింపఁజూచుచుండును. మఱియు గొప్పవారలచే సత్కారమందుటకును ముఖస్తుతి సేయుచుందురు. లేక మోమోటమిచేతనైనను ముఖస్తుతిఁజేయుచుందురు. ముఖస్తుతి సేయువారలు, సామాన్యులగువారిని నింద్రునితో సమానమగుభోగముగలవారినిగాను, లోభులగువారిని దానకర్ణులనుగాను, కురూపులను సురూపులగాను, వేయేల? దుర్గుణములనన్నిఁటిని సుగుణములుగాను బరిగణించి స్తుతించుచు లేనిపోనిగుణముల నన్నిఁటి నారోపించి ప్రోత్సాహముఁ జే

యుచుందురు. కడకుఁ దాము వచ్చినపనిని నివేదించి నెఱవేర్పుఁడని కోరుచుందురు. ఆసమయమునఁ గొందఱు, వారొనరించిన ముఖస్తుతికుబ్బి తబ్బిబ్బుపడి వారిమాటకు మారుమాటాడనేరక వారుకోరిన పనిని దమసామర్థ్య మంతయు వినియోగించి కొనసాఁగునటులఁ జేయుచుందురు.

ఎటులైననేమి? పరోపకారముఁ జేయుచుండిరికదా యని యనెదరేమో? కాని యటులఁ జేసినది నిష్ప్రయోజనమేయగును. కారణమేమన? ముఖస్తుతిసేయువారలు సామాన్యముగా నుత్తములుగా నుండరు. కాన నిట్టివారల కుపకారమొనరించుట మంచిదికాదని చెప్పియుంటినికదా.

ఎవరు మనయెదుటఁ గైకోలుసేయుచు మనమాచరించని మంచిగొప్పపనులను మనముజేసినటుల నారోపించి ప్రియముగా సంభాషించుచుందురో వారావల మగుడ మనల నిర్లక్ష్యముగాఁ జూచెదరు. కాన వీరిని శత్రువులుగా భావించుము. ఎవరు సద్బుద్ధితో మనయెదుట మనమంచిగుణముల దాఁచిపెట్టి దోసముల నెత్తిచూపించుచు వానికిఁ బ్రతిక్రియలఁ దెల్పుచు హితముపదేశించుచు మనలఁ గొనియాడక కఠినముగా మాటలాడుచుండెదరో వారావల మనమంచి గుణములఁ బ్రకటించి మనమెక్కువ సత్కీర్తిఁ జెందునటులఁ జేయుచుందురు. కాన వీరిని మిత్త్రులనుగా భావించుము.

ఈయిద్దఱిలో ముఖస్తుతిఁ జేయువానిపలుకులు మనకుఁ జిలుకపలుకులుగా నుండును. కాని యటుతరువాత హీనదశ

కు లోఁగియుండవలసివచ్చును. ఇఁక ముఖస్తుతి సేయనివారి పలుకులు మనకు ములుకులై పీడించుచున్నను తుదపరి నెక్కు వసద్వ్యశ మొందునటులఁ జేయును. ఈముఖస్తుతి నంగీకరించి ప్రవర్తించుచుంటిమేని మోసముపోయి చెడకయుండము. కాన నొకపరిమైన నొకఁడువచ్చి మనముందట నిచ్చకపు మాటలాడుచువచ్చిన వానినావలకు దఱిమి "యిటుల నిఁక నాదగ్గఱ ముఖస్తుతిసల్పకు" మని హితోపదేశముఁ జేయవలెను.

ఇటుల ముఖస్తుతివలన మోసపోయి చెడినవారలు పూర్వులలోఁ గొందఱు కలరు. వారిలో నొకనిని దార్ష్టాంతముగాఁ జూపెద.

మున్ను తారకాసురునివలన బాధలఁబడుచు దేవతలు హవిర్భాగములు లేకుండ నుండిరి. దీనిని దేవేంద్రుఁడుకాంచి తనకు వానిని నిర్జించుటకు శక్తిలేమిచే బ్రహ్మనురావించి తమబాధలఁదెలియపఱచి వానిని సంహరించుట కుపాయము చెప్పుఁడని పృచ్ఛించెను. అంత నాతమ్మిచూలి "ఇంద్రా! ఆతారకాసురుని జయించుట కీశ్వరునిపుత్త్రుఁడుతప్ప మన మెవ్వరమునుజాలము. కాననాయీశ్వరునికిఁ బుత్త్రోద్భవ మగునటుల నుపాయమాలోచింపు"మని యంతర్ధానమాయెను. అంత నింద్రుఁ డటులనె చిరకాలమాలోచించి తనభటునిచే విష్ణుకుమారుండగు మారుని రావించి ప్రత్యుత్థానపూర్వకంబుగ నుచితాసనంబిడి కుశలమును బరామర్శఁజేయుచుఁ

బ్రియముగా సంభాషించుచుండెను. అంత నాకందర్పుఁ డా యింమ్ర్రని వినయాదులకు సంతోషించి "మహేంద్రా! స్వర్గ లోకాధిపతివగు నీవు, సామాన్యుఁడనగునన్నుఁ బిలిపించుటకుఁ గారణమేమి? మీరానతిచ్చినపని యేదిమైన నవలీలగాఁ దప్పక చేయుదు" నని సాహసించి పలికెను. అంతనాదేవేంద్రుఁడు "మన్మథా! నీవు చతుర్దశభువన పరిపాలకుండగు విష్ణునిపుత్త్రుఁడవు. మహాపరాక్రమశాలివి. నీతో సమానమైనవారీజగములను లేరు. మఱియు నాకు రెండస్త్రము లుకలవు. (1) నా వజ్రము (2) నీవను నస్త్రము. వజ్రము సమస్తప్రదేశములందును జొచ్చునుగాని విరాగుల జోలికిఁ బోనేరదు. నీవను నస్త్రమన్ననో కాముకులయందును, మౌనులయందును మఱియుఁ బ్రతిచోటను బ్రవేశించి కార్యము సాధించఁగలదు. కాన సర్వము నీయందున్న" దని లేనిపోని వానినిగలిపి యెక్కువగా స్తోత్రముఁజేసి యా మదనుని నుబ్బించి "నెచ్చెలీ! నీమిత్త్రులమగు మేము తారకాసురుని వలన బాధపడుచున్నాము. వానిని సంహరించుట కీశ్వరకుమారుఁడుతప్ప మేమెవరము శక్తులముకాము. కాన మహేశునకిఁ గుమారసంభవమగునటులఁ జేయుము. తదుపరి మా బాధలఁదీర్చు"మని యనేకభంగులఁ గోరెను. అంత రతీదేవుడు తనసఖీసఖు లిరుగురు వద్దువద్దనుచుండ వల్లెయని పాకశాసనుని వీడ్కొని తనసఖుఁడగు వసంతునితో ఘోరముగాఁ దపమాచరించుచున్న గంగాధరుని, నతనినారాధించుచున్న

పార్వతీదేవినిఁజేరి వారిద్దఱినిఁగాంచెను. అంతఁదనసఖుఁడు చల్లనిగాలితోఁగూడికొనిన పుష్పపరిమళమెల్లెడ వ్యాప్తిఁ జేయుచుండఁ దానాయీశ్వరునిపై నస్త్రములఁబ్రయోగించుచుండ నది చేతినుండిజాఱెను. తిరిగి యాయస్త్రము నతఁడు తీసికొని సమ్మోహనమను నస్త్రమును బ్రయోగించెను. వెంటనే యాయీశుఁడు "ఎవఁడిటులనాపై నస్త్రముంబ్రయోగించువాఁడు. నేను రుద్రుఁడనని యామదాంధునికిఁ దెలియదు కాఁబోలు. వాతపము భంగముఁజేసె" నని రౌద్రముకలవాఁడై భ్రుకుటి ముడివడ మూడవనేత్రమునువిప్పి యాకసమున దేవతలందఱు "కోపముసంహరింపుఁడుపసంహరింపుఁ" డను పలుకులు పలుకుచున్నంతలో నాయస్త్రమును బ్రయోగించిన మన్మధుని భస్మావశేషునిగా నొనరించెను.

చూచితిరా! ఆమన్మధుఁ డటులు నాశనమగుటకుఁ గారణమేమి? ఇందుఁబ్రని ముఖస్తుతియే కదా? తనసఖసఖులిరుగురు వద్దువద్దనుచున్నను నాపని నొప్పుకొనుటకుఁ గారణమేమి? ఇందుబ్రనిముఖస్తుతియే కదా? కాఁబట్టి యెవరైననిచ్చకపుముచ్చటలకిచ్చగింతురేని నిటులనే వారికిఁ గీడులు మూడఁ గలవు. కాన మనము ముఖస్తుతికిలొంగి యేపనిలోను బ్రవేశించకూడదు. ఆముఖస్తుతిసేయువానిపని మంచిదా? లేక చెడ్డదా? యని విచారించి మంచిదైనయెడల సహాయముఁ జేయవలయును. అంతియకాని ముఖస్తుతివలన లొంగి యె

క్కువగా నతఁడు చెప్పుదానియాందునఁ బ్రవేశించకూడదు.
ఈవిషయము జ్ఞాపకముంచుకొనుఁడు.

క. ఇచ్చకము భువిని వశ్యము
కుచ్చితమీలోకనింద • కోవిదునకు నీ
తుచ్ఛమున హాని వచ్చును
మచ్చరమే తన్నుఁజెఱచు • మహిలో వేమా!.

—•—

# అసూయ.

ఓర్వలేనితన మసూయ యనఁబడు.

మనుజున కీయసూయయుండిన నభివృద్ధికి రానేరఁడు. జనసుతు లైన నీయసూయనుగలిగి యున్నయెడల వారు నిందాపాత్రులు కాఁగలరు. తనతో సమానమైనవారలు కొంచెముచ్చదశకుఁబోయినయెడల వారినిఁ గాంచి లోలోపలఁ గుందుచు సమయమునువేచి వంచింపఁ జూచుచుందురు. ఇట్టియసహనముకలిగినవారలన సహిష్ణులని యనెదరు. ఒకఁడు మంచిపనిఁ జేయుటయొ లేక వాఁడు ప్రజలచే సంస్తుతినిఁబొందుచుండుట యొకాంచియశక్తుదుర్జనులై యింటిలోపల నొకమూలఁ గూర్చుండి పరితాపముఁ జెందువారు కొందరసహిష్ణులుకలరు. అటులవృద్ధిఁ బొందినవానిని బాహాటముగా నసహిష్ణుతాలాపముల నాడుచుండెడివారు మఱికొందఱు గలరు.

యోగ్యులగు ధనికులు కొందఱొక మంచివిద్వాంసుని సన్మానించి యాయనకు బహుమానము లొసఁగుట కుద్యమించుచుండ నాసంగతి నీయసహిష్ణు లెఱిఁగినవెంటనే యాతని గౌరవించువారల వద్దకువెళ్ళి ముందుఁ దాఁజెప్పుమాటల వారువినినను వినక పోయినను రహస్యముగా మెల్లఁగా" నా పండితుఁడు యోగ్యుఁడుకాఁడు. కాన గౌరవపాత్రుఁడుకాఁడ" నుమొదలగు నసత్యాంశములఁ జేకొని స్వకీయధనముపోయినటుల కర్ణమంత్రముల నుపదేశించుచుందురు. కాని యీయసహిష్ణువాక్యములు యోగ్యులకవాచ్యము లుగాఁ కన్పట్టును.

ఒకకవి లోకోత్తరసత్కవియై యాబాలవృద్ధులచేగొనియాడఁ బడుచు రసవత్తరములగు దనపొత్తములమొత్తముల జనుల చిత్తముల రంజింపఁజేయుచు లోకోపకారియై యొనగుచుండఁ గొంద అసూయాక్రాంత చేతస్కులై దురభిమానముచే నాకవీశ్వరునిఁ బ్రకటనముగాఁ దూలనాడుచు నెవ్విధమునైనను నాకవీశ్వరునియశ వడుగఁటుటకుఁ బ్రయత్నమొనరించుచు కృతార్థులమని తలఁచుచుందురు.వీనినిదగినటుల దండించినవారలు లోకపూజ్యులని చెప్పవచ్చు.

ఈయోర్వలేని వారిముందఱ మంచిబట్టలఁ గట్టి తిరుగుచుండినను మంచిమంచి యనుపానములతో నన్నమును సలక్షణముగాఁ దినుచుండినను, జనులందఱు సంతసమునఁటులఁ బ్రాజ్యంబగు రాజ్యంబును బరిపాలించుచుండిన

లేక సద్గుణములవలనఁగాని పాండితివలనఁగాని, దానమువల నఁగాని, వన్నెకెక్కుచుండిన నాయసహిష్ణువులు చూడఁజా లక వారికిఁదగినటుల నెగ్గుల ఘటించుచుఁ దుదకు వారిని చీనులనుగాఁజేయుట కుంకించుచుందురు.

పైఁజెప్పినవిషయములందెకాక ప్రతి విషయమందు నను దనకంటె నితరుఁ డభివృద్ధిగానున్నాఁడనిన వానివృద్ధి నంతరింపఁజేయుటకు వీరు యత్నించుచుందురు. "ఒకరికి నున్నదని యేడ్వ నొకకన్ను, తనకు లేదని యేడ్వ నింకొక కన్నుపోయినదను సామెత నిక్కమగుచున్నది.ఎందువలననన? ఈయోర్వలేనివారు తమగతి ముందెటులఁగాఁగలదో దానిని విచారించకుందురు. కాబట్టి విచారించిన వారీయసూయక లిగియుండరని చెప్పగలను. అసూయకలిగినవారలు సర్వసు ఖములవీడి యప్రతిష్ఠతో నవసానదశకు రాఁగలరు.

ఇట్లసూయాభావముకలిగియట్టి యధోగతికివచ్చినవార లు పూర్వులలోఁ గొంతమందికలరు.వారిలో నొకనిఁజెప్పెద.

తనయనుజులు నలుగురు చేఁదోడువాఁదోడుగానుండ ధర్మరాజుచేయురాజ సూయాధ్వరంబునకు దుర్యోధనుఁడరి గెను. అంత నతఁడామహాధ్వరంబు ముగిసినపిమ్మట మయు నిచే నివ్వఁబడినసభఁజూచి యందలి చిత్రములంగాంచి య బ్బురమందెను. అంత నామహారాజాసభావిభవంబును, నా రాజసూయాధ్వర మహోత్సవంబును, గన్నులారఁజూడలేక పాండవులపేడ్కోని నిజరాజధానియగు హస్తినాపురంబున

(ఫిల్లి)కుఁ జని కుందుచు నిద్రాహారాదుల విడనాడి కృశించు చుండెను. అంత నాతని యాంతరంగికమిత్రుఁడును, మేనమామయునగు శకుని తనయల్లునిఁజూచి "సుయోధనా! నీ వేల యిటులఁ గృశించుచున్నావు? కారణముఁ దెల్పు"మనియడిగెను. అంత నారాజరాజు "మామా! ఆధర్మరాజుసభావిభవంబును, నధ్వరముయొక్క తుదిదినమున నతఁడధ్వర్యులకు దక్షిణలొసంగి సత్కరించినవిమ్మట, ధర్మజ్ఞులగు ధౌమ్యాదు లాసభయం దాయుధిష్ఠిరుని నవరత్నఖచితసింహాసనాసీనుఁగావించి వివిధ దేశాగతరాజు లాయజాత శత్రునకుఁ దెచ్చినరత్నములు, ముత్యములు, మణులు, ఏనుగులు గుఱ్ఱములు, కాల్బలములు మొదలగుగొప్పగొప్పకానుకల నా యారాజులచే సమర్పింపఁజేయుచు జనులందఱు జయజయధ్వనులు సేయుచుండఁ "రారాట్టను పేరుతో నుండిననేను జూచుచుండఁ బట్టాభిషిక్తునిఁ జేసిరి. అహా! ఏమి వానివైభవము. మఱియు నతఁడు నన్ను రత్నపరిగ్రహణమునకుఁ నియమించెను. ఆధర్మరాజుయొక్క సదనము రత్నాకరమనఁ జెల్లు. ఆవైభవమంతయు నేఁగనులారఁ జూడలేక వీనులార వినలేక నిక్కముగా నిటులఁగృశించుచున్నాను. అతనిసంపదసంతయు నేఁబొందినపుడు సుఖముగా నుండఁగలను. కాన దీనికిఁదగిన యుపాయమాలోచింపు"మని పలికెను. అంతనాశకునివిచారించి తనయల్లుతో "వానిసంపదసంతయుఁబొందుటకు మాయాద్యూతమెసాధనము. కాన దీనికె మిత్రుఁడీ సమ్మతింపవలయు"

నని పలికెను. అంతట దుర్యోధనుఁడు తనమామతోఁ దండ్రి యగుధృతరాష్ట్రునిపాలికిఁబోయి నమస్కరించిరాజసూయ సభావైభవంబులఁ దెలియబఱచి తనయసహనముఁగూడఁ బ్రచురపఱచి ద్యూతమాడుట కనుజ్ఞనిమ్మని కోరెను. అంత నాయాంబికేయుఁడు॥ కుమారా! నీతివిశారదుఁడగువిదురుఁడు సమ్మతించిన నేనంగీకరించెద,, ననియనెను. అంతనాదుర్యోధనుఁడు ॥నాయనా! ఆవిదురుఁడు పాండవపక్షపాతిగాన సమ్మతింపఁడు. గనుక మీరానతిచ్చిననాతఁడంగీకరించినట్లే,, యని పలుభంగుల భాధపెట్ట నెట్టకేలకు గాంధారీపతి వల్లె యని వారిని వీడ్కొలిపెను. అంత నాయాంబికేయుఁడు విదురుని బిలిపించి తనకొమరునిమనోరథమును దెలియబఱచెను. అంత విదురుఁడాద్యూతము కులక్షయకారి'' యనిచెప్పెను. అంతట నాధృతరాష్ట్రుఁడు మగుడ తనసుతునిఁబిలిచి'' సుతుఁడా! నీవును రాజసూయంబుఁజేసి వాసిఁగాంచుము. నీకు ననేకరాజులు గొప్పకానుకలు తీసికొనిరాగలరు. వారిసంపదఁజూచి యోర్వలేనితనమును విడనాడుము. మాయాద్యూతము మానుకొనుమని యనేకరీతుల నీతులబోధించెను. కానియాదుర్యోధనుఁడు పెడచెవినిఁబెట్టెను. అంత నాధృతరాష్ట్రుఁడు పుత్త్రప్రేరితుఁడై విదురునిచేధర్మరాజుఁబిలిపించి తనకుమారునిఁబిలిచి "యికనీయిష్టమువచ్చినట్లుసేయు" మనిపలికెను. అంత నాదుర్యోధనుఁడు తనకుమారుగా శకుని ని బలవంతముగా ధర్మరాజును, నరవరగురువర నికర పరీ

వృతంబగు నాసభయందున జూదమాడుటకుఁ బ్రారంభము గలవారినిగా నొనరించెను. అందున ధర్మరాజోడుఁవడున ట్లుగావించెను. ఆధర్మరాజుయొక్క విత్తము నపహరించి కాననమునకు సతీసోదర సమేతముగాఁ బంపించి కృతార్థుఁడ నై తి,, ననియానందమందుచుండెను. ఇంతలో నాధర్మరాజాదులు తిరిగివచ్చి భండనమున నూఱుగురుతమ్ములతోఁగూడ నాసుయోధనునిఁ బరలోకగతునిగా నొనరించిరి.

విలోకించితిరా! ఆదుర్యోధనుఁ డాధర్మరాజుచేయు రాజసూయంబును, సకలజనానంద సంధాయకమగు నాస భావైభవంబును, జూచి సహనముగా నుండిన నిట్టి యిక్కట్టుల కాటపట్టుకాఁగలఁడా? కాఁడు. వానియందోర్వలేని తన ముండుటంబట్టియే యిప్పటికిమనవార లాదుర్యోధను ననహిష్ణువుగా లెక్కించుచుందురు. కాన మనమసూయకలిగి యసహిష్ణులమని యనుపించుకొనకయుండి సర్వసుఖములఁ బొందుటకు యత్నించుచుందము.

ఆ. వె. ఓర్వమిందుఁ బ్రైనఁనూరక కష్టాల
పాలుఁజేసి మిగుల॰ బాధఁబఱచుఁ
గాన దాని మనము॰ గై కొనంగనురాదు
మిత్త్రులార! సచ్చ॰రిత్రులార.!

## ఆశ.

ఆశయనగా నొకదానినిగోరుటయే.

ఈయాశయనునది ప్రతిమనుజునికి స్వాభావికముగా నున్నది. బాలురకు విద్యయందుఁ గోరిక యుండును. యౌవనవంతులకు భోగాదివిషయము లందాసక్తి యుండును. వృద్ధులకుఁ దమపుత్త్రులయభివృద్ధియం దాశ యుండును. కవులకుఁ గావ్యరచనయందును. గాయకులకు సంగీతమందునను, గోరిక యుండును. రాజులకుఁ బరరాజ్యస్వీకరణమం దాస యుండును. విరాగులకు భగవంతునిఁజేర నపేక్ష యుండును. వేయేల? ప్రతివానికి నేదోయొకదానిపై నాశయుండియే తీరు. దీనిని బోఁగొట్టుట కెవరునుజాలరు. ఇటులఁ గోరియుండుటమంచిదనియే నాయభిప్రాయము. ఎందులకనఁ? మన మొకఫలమును గోరనిదే యేపనినిఁ జేయఁజాలము. ఈయాశయే మనయభివృద్ధిసూచకము. ఈయాశవలననే కష్టములనుండి విడుదలఁ జెందుచున్నాము. కాఁబట్టి ప్రతివాఁడాశకలిగియుండుట మంచిదేకాని తనతలకుఁదగనియాశ కలిగియుండఁగూడదు. ఈతలకుఁదగనియాశనె యత్యాశయని యనెదరు. ఇది మంచిది కాదు. ఎవఁడైనను, దనసామర్థ్యమును గుర్తెఱుఁగక గొప్పకోరికలఁగోరఁగూడదు. ఒకవేళ నటులఁ గోరినను నవి వ్యర్థములు కాఁగలవు. వీనినే గొంతెమ్మకోరికలనెదరు. ఇట్టి వ్యర్థమగునాశనే దురాశయని వచించెదరు. దీనిని నేను ముమ్మా

టికి నిరసించుచున్నాను. కారణమేమన? ఈదురాశ, విషవృక్షముతో సమానముగాఁ బట్టియే!. విషవృక్షతుల్యమగు నీదురాశను గోరినవారల కది విషఫలములనిచ్చుచుండును. వానిని దినినవారలగతిఁ జెప్ప,వ్రాయ, నలవిగాదు.

ఈదురాశ, యొకతల్లికిఁబుట్టిన కొమరులను విడఁదీయుచున్నది. వారలను న్యాయసభలకెక్కించుచున్నది. అంతవారిచే సొమ్మంతయు నమ్మించఁ జేయుచున్నది. మఱియుఁ దండ్రికొమరులకుఁ దలపట్లు పట్టించుచున్నది. జనులయైకమత్యమును ధ్వంసము సేయుచున్నది. ఇది, యది,యననేల? ఈదురాశ, సుఖములనెల్లఁ జిటికలోఁ బాపి యనేకకష్టముల జేయించఁ గలదు. ఈదురాశ,చేయఁ దగనిపనులఁ గూడఁజేయించఁ గలదు. ఒకవేళ మనము దురాశకులోఁగి చేయఁదగనిపనులఁ జేసిన నవి మననాశనమునకై కారణములగుచుండును. దురాశ గలిగిన వారలకుఁ దృప్తియుండదు. తృప్తిలేనివారలకొకకాసైన (పైసలో 5 వవంతు) నివ్వగూడదు. ఒకసమయమున నిచ్చినను నది బూడిదలో నాజ్యముఁబోయుటయె యగును. దురాశగలిగినవారలు, తమసామర్థ్యముల గుర్తెఱుఁగక గొప్పగొప్పపనులఁ జేయ నుంకించుచుందురు. ఇటులఁ బ్రయత్నించుట "అందనిమ్రానిపండ్లకు నఱ్ఱులు జాచుటయె" యగును. దానివలన నితరులనగుబాటుకు లోనగుచుందురు. మఱియు నవమానముల కొడిఁగట్టవలసివచ్చును.

ఆమూల్యములగు బాల్యయౌవనములు గడచి వార్ధక్యమువచ్చినను నానమాత్రమువిడనాడక యుండును. ఈ యాశకంత మే లేదు. ఇట్లంతములేనిదురాశ మనమునఁ గలిగి యుండఁగూడదు. కలిగినయెడల నిడుములఁబడఁగలము. ఇటుల దురాశవలన నిడుములఁబడినవారలు కొందఱు కలరు. వారిలో నొకనిని జెప్పుచున్నాను.

తొల్లి దుర్యోధనమహారాజు దురాశచేఁ బిన్నవారలును, దనపినతండ్రికుమారులును నగుధర్మరాజాదులకు భాగ మెగవేయఁదలఁచెను. అందులకుఁ దగినకపటోపాయముల ననేకములఁ జేసెను. అవియన్నియు వ్యర్థములాయెను. తుదకు ధర్మాత్ములగునాధర్మరాజాదులను జంపనెంచెను. అందునకుఁ దగినదురాలోచనము దురాత్ములతోడ నొనరించి తనతండ్రిచే నాధర్మరాజాదులు కాశీపట్టణమునకుఁజనునటుల వారికిఁ జెప్పించెను. తదుపరి యాదుర్యోధనుఁ డావారణావతమున ధర్మరాజాదులునివసించుటకై తననెచ్చెలియగు పురోచనునిఁబిలిచి రహస్యముగా వానితో "నీవుముందుగాఁ గాశీపట్టణమునకుఁబోయి నయనాభిరామముగా నొకలక్కయిల్లుఁ గట్టుము. మఱియు నీవుకట్టినలక్కయింటిలో వా రేమఱి కాఁపురముఁజేయుచుండుతఱి నాయింటికిఁజిచ్చుపెట్టి వారిని దగ్ధులనుగాఁజేయుము" మని పంపెను. అంత నతఁడటుల సేయుటకుఁజని లక్కయిల్లు సొగసుగాఁగట్టి సిద్ధముగా నుంచెను. తరువాత ధర్మరాజాదులు తమపెదతండ్రిగారి యానతిని శివ

నివహించి గురుకులపతులయాజ్ఞఁ గైకొని యావారణావతమ్ము
నకుఁజని యాలక్కయింటిలోనె జాగరూకులై సుఖముగాఁ
గాఁపురముఁ జేయుచుండిరి. కొంతకాలమైన తరువాత నీతివి
శారదుఁడగు విదురుఁడు ఖనకుఁడను నొకనిని బిలిచి వా తో
“నీవు వారణావతమ్మునకుఁజని పాండవులఁ జేరి పరమరహస్య
ముగా నీ బహుళచతుర్దశీదివసమున రాత్రియందుఁ బురోచ
నుఁడనువాఁడు మీరున్నలక్కయింటికగ్గి పెట్టి మిమ్ములను
దగ్ధులగాఁ జేయగలఁడు. కాన జాగ్రత్తతో నుండుడని వారికిఁ
జెప్పవలసిన” దని పంపించెను. అంత నా ఖనకుఁడటుల నే చేసెను.
అంతట భీముఁడా నియమితదినమున రాత్రియం దా పురోచ
నుఁ డా యింటికగ్గిఁ బెట్టకమునుపె యాపురోచనాదు లాయిం
టిలోనే గాఢనిద్రఁబోవుచుండెడి సమయమున నాలక్కయిం
టికిఁ జిచ్చుఁబెట్టి విదురుని పంపున వచ్చిన ఖనకునికిఁ దమక్షేమ
ముఁ దెలియఁబఱచి తనయన్నను, తమ్ములను, దల్లిని, దనపై
నిడికొని యొకబిలమును సొచ్చి యొకచో సుఖముగాఁ జేరెను.

చూచితిరా! ఆదుర్యోధనుఁడు దురాశచేతఁ బిన్నవార
లగుపినతండ్రి కుమారుల భాగమున కెగనామముఁ బెట్టఁద
లఁచెనుగదా! తుదకు వారినిఁ జంపఁదలఁచెనుగదా! దాని
కిఁ దగిన యుపాయ మాలోచించి పురోచనునిచే లక్కయిల్లుఁ
గట్టించి వారిని నాశనమును జేయుమని యాపురోచనుని కు
పదేశ మొనరించి పంపించెనుగదా. ఆతఁడా విధమునఁ జేయు స
మయమును వేచియుండ నింతలో భీముఁడు తెలిసికొని యాపు

రోచనుఁడు పెట్టకమునుపె తానగ్గి నాయింటికంటించి వారి ని దగ్ధులనుగా నొనరించి మాతృసోదరసమేతముగా సుఖముగా నొకచోఁ జేరెనుగదా. ప్రస్తుతము దురాశవలనఁ జెడినదెవరు? దుర్యోధనుఁడేకదా. ఈతఁడుతన్నుఁ గట్టదాళ్ళు తానె తెచ్చుకొనెనుకదా. వీని కీదురాశయె లేనియడల బాగుపడునుగదా. కాఁబట్టి దురాశఁ గలిగినవారలు దుఃఖభాగులగుదురు. కావున మనము దురాశవిడనాడి తగినయాశ కలిగియుండి సత్కార్యములఁ జేయుచుందము.

క. అది సర్వదోషముల కా
స్పద మది దురితక్రియానుబంధంబులకున్
మొదలు నిరంతర దుఃఖ
ప్రదమని మదిఁదలఁచి తృష్ణఁబాతురు సుమతుల్
(భారతము.)

---

# అహంకారము.

---

నేనే శ్రేష్ఠుఁడనను బుద్ధిని జనింపఁ జేయునదియహంకారమనఁబడు.

ఇది, తన మాటకెదురు మాటాడకయుండునపుడును, లోకము తాఁజెప్పుదానినె విశ్వసించి యాచరించు సమయమునందునను, మఱియు నొక విషయమునఁ దానధికుఁ డని జనులచేఁ బొగడ్తను బొందినపుడును జనించుచుండును.

ఈయహంకారము, ధనాహంకారము, కులాహంకారము, విద్యాహంకారము, రూపాహంకార, మను పేరులతో నాలుగువిధములుగా నుండును.

అందున మొదటిది ధనాహంకారము, అనఁగా డబ్బు వలనవచ్చిన గరువము. ఇది, దరిద్రులమీఁదికి నోంటికాలిపై లేచును. భృత్యులను వేధించుచుండును. ముఖస్తుతులఁ గోరుచుండును. క్రోధమునకుఁ బ్రోత్సాహముఁ జేయుచుండును. యుక్తాయుక్త విచారణ పస్నగిలఁజేయును. అధర్మములకు ముందంజవేయును.

రెండవది కులాహంకారము. అనగా మంచికొలమునందుఁ బుట్టినందువలన వచ్చినగరువము. ఇది తక్కువ జాతులపై హుటాహుటిఁ జనుచుండును. తనకంటెఁ దక్కువజాతిలోనుండువాఁడు విద్వాంసుఁడైనను వానినిఁ దృణీకరించు చుండును.

మూఁడవది విద్యాహంకారము. అనఁగాఁ జదువువలన వచ్చినగరువము. ఇది, విద్యావిహీనుల మనుజులుగాఁ బరిగణించదు. కించిజ్ఞులను నీచులనుగా లెక్కించుచుండును. సరివారలను వెక్కిరించును. ఎక్కువవారలకుఁ గపటవినయమును జూపుచు వారిని నిర్లక్ష్యముగాఁ జూచుచుండును. తనతో సమానమైనదింకొకటిలేదని తలఁచును.

నాలుగవది రూపాహంకారము. అనఁగా సొగసైన యాకారమువలనఁ గలిగినగరువము. ఇది, యబలలపై దషా

బునఁ జనుచుండును, ప్రతిసుందరస్త్రీయును తన్నుఁజూచిమో
హముఁజెందుచున్నదని భ్రాంతిఁబడజేయుచుండును. డంబము
కొఱకై ధనమును వ్యయముఁజేయించుచుండును.

మిత్రులారా! ఒక్కొక్కగరువ మెంతనష్టముకలిగించుచున్నదో కనుగొంటిరికదా. ఇఁక నీనాలుగు నొకచోఁగలిసి పనిఁజేయుచుండిన నిఁకేమిచెప్పవలెను? చెప్పవలను పడని దురవస్థల ఘటించునుగదా. ఇట్టిగర్వముగలిగిన వారలను గర్వులని యనెదరు. వీరు మొదటఁ దమతోసమానులు మాత్రము కొందఱుగలరని తలఁచుదురు. అటుపైఁ దమతో సమానులుకాని తమకంటె గొప్పవారలుకాని లేరని యెంచుదురు. అంతట నీభూలోకమునుగూడ మేమే సృజించితిమని యనుకొనుచుందురు. ఆహా! ఏమి! ఈయహంకారుల మహిమ! భగవంతునిగూడ నిరసించుచున్నారుకదా. ఈయహంకారు లితరులను బ్రేమింపరు, ఇతరులచేఁ దాము బ్రేమింపఁబడరు. డంబమునకై లేనిపోని చేతఁగానిపనులనెత్తినివేసికొని తన్నుకొనులాడుచుందురు. వీరవమానములఁబడుచుందురు. యుక్తాయుక్తవిచారణలేని యీగర్వులు మనీషులకు గర్హ్యులు కాఁగలరు. ఈయహంకారు లదివఱకున్నగౌరవముకూడ నీగర్వముచేతఁ గోల్పోవుదురు. మఱియు వీరిప్రాణములకు హానియుఁగూడ సంప్రాప్తించఁగలదు.

ఇటుల గర్వమువలనఁ బ్రాణహానిని బొందినవారును

బూమ్యాలలోఁ గొందఱు కలరు. వారిలో నొకనిని జూపించు చున్నాను.

మున్ను మాహిష్మతీపురంబునఁ గార్తవీర్యార్జునుఁ డనువాఁడు దత్తాత్రేయానుగ్రహంబున సకలసంపదలఁ బొంది సుఖముగా సహస్రబాహువుల రాజ్యముఁ బరిపాలించు చుండెను. అతఁడితరరాజులను దనకుఁ గప్పముఁ గట్టువారలనుగాఁ జేసికొని తనయాజ్ఞకు నందఱిని లోఁబఱచుకొను చుండెను. ఆసమయమునఁ దనకత్తి కెదురుకత్తి లేకయుండెను. అందువలన నాకార్తవీర్యార్జునుఁడు నాతో సమానుఁడగు పరాక్రమశాలి యీలోకమున లేఁడని గర్వించి యథేచ్ఛముగా నుండెను. అట్టితఱి రావణాసురుఁడు దిగ్విజయార్థం బీరాజున మీపమునకుఁ గూడ వచ్చెను. అంత నీయర్జునుఁ డారావణుని బాధించి తనచెఱసాలలోఁ గొన్నిదినములుంచి జాగ్రత్తగా నుండుమని బుద్ధిఁ జెప్పి చెఱసాలనుండి విడుదలఁ జేసి పంపించివేసెను. వీనిని జయించుటవలన గర్వమధికమాయెను. అంత నొకసమయమున నీయర్జునుఁడు జమదగ్నియాశ్రమమునకుఁ జనెను. అంత నాజమదగ్ని యతిథిగావచ్చిన యారాజును సత్కరించి తనహోమధేనువునరప్పించి మృష్టాన్నములఁ గురిపించి యారగింపఁ జేసెను. అంత నారాజా యన్నమునుగుడిచి కూర్చుండి యిదివఱకాహోమధేనువు చేసినపని కత్యాశ్చర్య మందుచు దానినపహరింపనెంచి "దీనినింటికిఁ దీసికొనివెళ్ళుఁ" డని తనసేవకుల కాజ్ఞనొసఁగెను. అంత నారాజభటులు,

జమదగ్ని వలదని చెప్పుచున్నను వినక యాహోమధేనువును దోలుకొనిపోయిరి. అంత నారాజుకూడఁ దన పురమునకుఁ జనెను. అటుతరువాత నాజమదగ్నికుమారుఁడగు పరశురాముఁడీసంగతియంతయువిని యాగ్రహముతో నారాజునగరమును జేరెను. అంత నారాజు తనకడకువచ్చిన పిల్లఁడగు నీపరశురామునిఁజూచి వీఁడు బ్రాహ్మణవిధంబున నుండుట మాని భండనమునకువచ్చియున్నవాఁడు. కాన వీనిని నిర్జించవలసినదే. యని గర్వముతో నాపిల్లనితో యుద్ధమునరింపసాఁగెను. తుదకా పరశురాముఁడా కార్తవీర్యార్జునిని యమపురికంపివేసి తనహోమధేనువును దీసికొనివచ్చి తండ్రికి నమర్పించెను.

కంటిరా! ఆకార్తవీర్యార్జునుఁడు గర్వముచేత నన్యాయమునకు దిగెనుగదా. దానివలన నతఁడు యమపురిఁజేరవలసి వచ్చెను. అతఁడేయననేల? నేనిప్పు డుదాహరించినయితిహాసము వలన రావణుఁడు పరాభూతుఁ డగుటయుఁ గార్తవీర్యార్జునుఁడు మడియుటయుంగూడ నిందులకు దాహరణము లే!తువకుఁ బరసురాముడుకూడ శ్రీరామునిపట్టున నిందులకే యుదాహరణముగాఁ గలిగెను. దీనివలన మనము దెలిసికొనవలసినదేమి? గరువమనునది యెంతటివారికిని బరిహరింపరానిది. కావున దానిపట్ల మనము కడుజాగరూకులమై మెలఁగవలెను. గరువమన్నను నహంకారమన్నను నొకటే! ఈ యహంకారమే యాపత్కరము. ఈయహంకారమును విద్యార్థు

లు కలిగియుండిన యెడల వారివిద్య పాడగును. ధనవంతులై గర్వమును గలిగియుండిన వారు తమధనమును వ్యర్థముగా వ్యయ మొనరించుచుందురు. విద్వాంసులు దీనిని గల్గియుండిన వారికుండుగౌరవము నాశనమగును. వేయేల? ఎవనికైన నీగర్వము కష్టము కలిగించునదియె యని నమ్ముడు. ఎంత యభివృద్ధి యగుచుండిన నంతతగ్గియుండ వలెనుగాని నిక్కియుండఁ గూడదు. అట్లులున్నవారలె లోకోత్తర సత్పురుషులు కాఁగలరు. కాన మనమహంకారము విడనాడి వినయముగా నుందుము.

క. గరువముఁ గలిగిన మనుజుఁడు
కరముగ నలజడులఁ బొందుఁగావున దానిన్
సరసర విడుచుచు వినయము
నరుసమునన్ బొందవలయు ననియుండ్రైనన్.

---

## కోపము.

---

కోపమనఁగా నొకరిపైఁ గినుకఁ జెందుటయె!

ఇది గర్వమువలనఁ గాని, తనపని కొనసాఁగనపుడు గాని యితరులు చేయరాని పనులఁ జేసినపుడుగాని జనించుచుండును. పాము కఱచినవిషము క్రమక్రమముగా నాశరీర మంతయు వ్యాపించినటుల నీకోపము వృద్ధిఁజెందుచుండును. అంత నిది మనుజుల గ్రుడ్లను ప్రత్తికాయలవలెఁ జేసి యగ్నిక

ణాములవలె నెఱ్ఱఁ జేయుచుండును. ఆగ్రహించు సూర్యునివలెఁ దీ
ముఖము నెఱ్ఱఁబాఱఁ జేయును. తోఁకఁదొ్రక్కిన త్రాచు
పామువలె బుస్సలుకొట్టించును. కుక్కవలె మొఱఁగించు
చుండును. కోఁతివలెఁ జెంగుచెంగున గంతులు వేయించుచుం
డును. ఏనుఁగుతొండమువలె నిట్టటుఁ జేతులఁ ద్రిప్పించుచుం
డును. పెద్దపులివలె దుమికించుచుండును. పటపట పండ్లుగీ
టించుచుండును. తులువమాటలాడించును. అనృతముల నా
డించును. తుదకు దెబ్బలాటకుఁ బురిగొల్పును. ఆసమయము
న నీకోపమునకుండు శక్తి మఱియొకదానికి లేదు. ఈకోపము
మోహముఁ జెందించును. మోహము బుద్ధియందు భ్రాంతిఁ
గలుగఁజేయును. ఆభ్రాంతి క్రిమక్రిమముగా బుద్ధిని నాశ
నము నరించును. బుద్ధినాశనమైనవాఁడు నశించఁగలఁడు. కాన
నీకోపముచేయుచుండు చెడుగుపనులను వర్ణించుటకు వేనోళ్లు
గలచిలువఱేఁడైనను శక్యముగాదు. ఇట్టి క్రోధముకలిగినవారిని
క్రుద్ధులని చెప్పెదరు.

ఈముంగోపులు బుధులైనను జంకక దుష్కార్యము
లం జేయఁగడంగుదురు. ఇటుల పేరాచరించుటవలన సజ్జనుల
కుఁ బూజ్యులుగానేరరు. కాని యీబుధులొకపరి కోపముఁ
జెందినపుడు సజ్జనుఁడొకఁడాతనిఁజేరి మీరిటులాచరించఁగూ
డదు. కాన నూరకుండుఁడని బోధించిన వారతని మాటవిని
కలహమాడక యూరకుందురు. ఆటులనె సజ్జనుఁడు చని దు
రాత్మునికిఁ జెప్పినవాఁడు మఱింత కినుకనూనును. కాని మిన్న

కుండునా? మిన్నకుండఁడు. చక్కనిపాలు పొంగువచ్చుసమయమునఁ గొంచెము నీరుఁజల్లిన నాపాలు పొంగుమానియుండును. ఆనీరునె క్రాగుచున్ననూనెలోఁ జల్లినయెడల నానూనె మరింత భగ్గునమండి యిల్లుఁగాల్పకయుండునా? ఉండదు. కాఁబట్టి సజ్జనుఁడు కోపిష్ఠుఁడైనను పెద్దలమాటవిని కినుకమానుననియు, దుర్జనుఁడు వినక యింక నెక్కువదౌర్జన్యమును జూపుననియుఁ దెలిసికొనవలయును. ఈముంగోపులు తారతామ్యభావములం గనుంచరు. కాని తమకంటె నెక్కువబలముగలవానిపైఁగాని తమయధికారిపైఁగాని కినుక సాధ్యమైనంతవఱకుఁజెందరు. కినుక వారిపైఁగలిగియున్నను నేమియుఁ బ్రయోజనము లేదని యీముంగోపులకుఁ దెలియును. కోపముగలిగినవారలు కష్టములఁజెందినతరువాతఁ బశ్చాత్తాపమొందుదురు.

అటులఁ గినుకచేఁ గష్టములఁబడి పశ్చాత్తాపముఁ జెందినవారు పూర్వులలోఁ గొందఱు కలరు. వారిలో నొకనిఁ జెప్పెద.

మున్ను దుర్వాసమహర్షి విష్ణుభక్తశిఖామణియగు నంబరీషునిసదనమునకుఁ జనెను. అప్పటి నాతఁడు ద్వాదశీపారణఁజేయ నుద్యమించుచుండెను. కాని యీ మహర్షి తన కడకువచ్చినసంగతిని విని యచటనుండి లేచి ప్రత్యుత్థానపూర్వకంబుగ నామహర్షినిఁ దోడ్కొనివచ్చి యుచితాసనంబిడి [illegible] నాయింటికిపుడె విందునకురమ్మని పిల

యపూర్వకముగాఁ గోరెను. దాని కామహర్షి యంగీకరించి "ఇదుగో వచ్చెద" నని స్నానార్థమై యమునానదికిఁ జనెను. అంత నారాజు తనమనమున "నీమహర్షి యిదుగోవచ్చెదనని చనెను. ఇంకను రాకపోయెను. కాలమా యతిక్రమించుచుండెను. వ్రతమా భంగమగుటకు సిద్ధముగానున్నది. ఏమి చేతు" నని జిజ్ఞాసఁబడుచుఁ బండితమతరీతిగావ్రతభంగము కాకుండుట కుదకముమాత్రము పుచ్చుకొని స్వాతివానకు ముత్యపుచిప్పలెదురుచూచినట్లామహర్షికై యెదురు చూచుచుండెను. అంతనాదుర్వాసమహర్షి వచ్చి యారాజు సలిలముఁ ద్రాగినసంగతిఁ దెలిసికొని కోపముతో "రాజా! నన్ను విందునకుఁబిలుచుట యెందుకు? అభ్యాగతినగునాకంటె ముందుగా నీవు భుజించియుండుటకేనా?" యని పలుకుచుఁ దననెత్తిని నుండు నొకజటను బెరికి "ఈయంబరీషునిఁ గాల్చివేయుగాక" యని యాతనిపై విసిరివేసెను. అంత నాజట భగ్గుభగ్గున మండుచు నాయంబరీషుని సమీపించెను, అంత నారాజు విష్ణుమూర్తిని ధ్యానింప నాభక్తవత్సలుఁడీభక్తరక్షణార్థమై చక్రమునంపెను అంతనాచక్రమామహర్షి ప్రయోగించినజటయొక్క మంటలనారిపి తిరిగి తానుభగ్గుభగ్గునమండుచు నాయంబరీషుని బాధించువాఁడును, ముంగోపియు నగుదుర్వాసుని జుట్టుముట్టెను. అంత నాదుర్వాసుఁ డామంటలకుఁదాళలేక గుహలను సముద్రములను జొచ్చెను. ఆతని వెంబడి నీ చక్రమునుజొచ్చెను. తుదకామహర్షి సత్యలోక కైలాసముల

కుఁ జని బ్రహ్మమహేశ్వరులఁ బ్రార్థించి మంటలార్పుఁడని కోరెను. దానికి వారు మావలనఁగాదనిరి. అంతట విష్ణుమూర్తినిగూడ సందర్శించి యతనినిగూడఁ బైవిధమునఁ గోర నతఁడుకూడ నావలనఁగాదు. కాని నాభక్తుఁడగునంబరీషుని వలన నీమంటలు చల్లారఁగలవని చెప్పెను. అందులకామహర్షి ఖిన్నుఁడై యిదివఱకు మంచివానిని బాధించుటవలనఁగదా మగుడ బాధలఁబొందుచుంటినని పశ్చాత్తాపముఁజెందుచు చివరకాయంబరీషుని సమీపమునకేవచ్చి యీమంటలనార్పి నాబాధఁదొలఁగింపుమని ప్రార్థించెను. అంత నారాజు విష్ణుమూర్తియనుగ్రహమున నాతనిబాధఁ దొలఁగింపఁ జేసెను. తదుపరి వారిద్దఱుకలసి యన్నమును భుజించిరి.

చూచితిరా? ఆదుర్వాసుఁ డారాజునుగోపముచే హింసింప మొదలిడెను. దానికిఁ బ్రతిఫలముగా నామహర్షి యెంతకష్టపడెనో తెలిసినదికదా. అతఁడు కోపమువలన నెంత యవమానముఁజెందినది యెంతపశ్చాత్తాపముఁ బొందినది యుఁ దెలిసికొంటిమికదా. కాఁబట్టి యెవరైననుగోపమువిడనాడినవారు సుఖింపఁగలరు. కాన మనము కోపమువీడి శాంతముగలిగి సౌఖ్యములఁ బొందుచుందము.

ఆ. వె. కోపమునను ఘనత • కొంచెమై పోవును
కోపమునను మిగుల • గోడుఁ జెందుఁ
గోప మడఁచెనేని • గోర్కె లీడేరు
విశ్వదాభిరామ! • వినర వేమ!.

# విమర్శనము.

చక్కఁగా విచారించుట విమర్శన మనఁబడు.

ఇది, చెడుగుపనులను జేయింపనీయదు. ఇదియే, లాభాలాభములగుఱించి దూరాలోచనమును జేయించును. ఇదియె గుణాగుణములఁ దెలియఁ బరచుచుండును. ఇదియె లోకజ్ఞానముఁ గలిగించుచుండును. ఇదియె, పాండిత్యిని వృద్ధిఁజేయుచుండును. ఇదియె తత్త్వఁపాటు నాపును. ఇదియె, నిదానము గలిగించుచుండును.

కాఁబట్టి వివిధఫలప్రదంబగు నీవిమర్శనము మనుజజాతికంతకు ముఖ్యము. ఇట్టివిమర్శనముకలిగినవారల విమర్శకులని చెప్పెదరు. వీరు తాము చక్కఁగా నడచుచు నితరులనుగూడ మంచిత్రోవల నడపించుచుందురు. వీరొకదాని విషయమై చర్చింపఁదలఁచినప్పుడు దానికి సంబంధించినయట్టి కొన్నివిషయములఁ బరిశీలించి బలాబలములఁగాంచినకారణముగా నిక్కమగుసంగతి సిద్ధాంతీకరించుచుందురు. మఱి కొన్నిసంగతులయందు వివేకముగాఁ బరిశ్రమఁజేసి హేతుసహితముగాఁ గొన్నిసంగతులను లోకమునకుఁ దెలియఁ బఱచుచుందురు. దానలోకోపకారముకల్గునుగదా. కాఁబట్టి యీవిమర్శకులు నిజదేశమునకు విశేషశ్లాఘాపాత్రులు. కవియైనను బండితుఁడైనను గాయకుఁడైనను శిల్పియైనను గావచ్చునుగాని విమర్శకుఁడనఁబడువాఁడగుట కష్టము. కారణమేమన?

ఈవిమర్శకు లేవిషయమును గైకొని విమర్శింపఁ దలఁచిరో యావిషయమందు వారికంటె నెక్కువ తెలిసినవారై యుండవలెను. ఇది చేదు. ఇది తీపు. ఇది పులుసు. లోనగురుచులను దెలియఁబఱచు నాలుకవలెనె యీకార్యము మంచిది. యీకార్యము చెడ్డది. యని యీవిమర్శకులు తెలియఁబఱచుచుందురు.

లోకమునఁ గించిజ్ఞులు వాచాటుని బండితునిగాఁ దలచుచుందురు. అట్టివట్టున నీవిమర్శకు లాప్రగల్భుని సత్త్వఁ దెలిసికొని యాకించిజ్ఞులకుఁ దెలియఁబఱచుచుందురు. ఎవ్వరైన నొకరు వచ్చి తమబోధలవలన మఱియొకరిని మోసముఁ జేయఁజూచిన యెడల నాసంగతి నీవిమర్శకులు గ్రహించి యాకపటినావల దఱిమివేయుదురు. ఇట్టి సద్విమర్శకులు పూజ్యులు.

ఇఁక దుర్విమర్శకులు కొందఱు కలరు. వారు దుర్విమర్శకులని వారి కారణములవలననే స్థిరీకరించవచ్చును. వారు మంచివానినిఁ గూడఁ గుతంత్రములచే నేదియో కొన్ని యల్పకారణములను గైకొని తప్పులని చెప్పెదరు. మఱియు వీరహంకారపూరిత చేతస్కులై యుందురు. కాన నీదుర్విమర్శకులు దూషణీయులు.

సద్విమర్శకులు వచించినపగిది మనము మనతప్పులను దిద్దుకొనవలయును. విమర్శించిన కొలఁది మంచిమంచి సంగతులు బయలువెడలును. సానఁబెట్టినకొలఁది వజ్రము ప్రకా

శమగును గదా. ఈసద్విమర్శకులు నిష్పక్షపాతముగాఁ జెప్పిన విషయము మాలిన్యరహితమై పదునాఱువన్నె మేలిమిబంగారువలె బాగుగా నుండును. ఈసద్విమర్శకులకు విమర్శనగ్రంథములను వ్రాయుటకుఁ బ్రోత్సాహముఁ జేయుచుండవలెను. మనము వారు చెప్పినమాడ్కి నడువవలయును. దాన మనమనేకలాభములఁ బొందఁగలము.

అటుల లాభముఁబొందినవారలలో నొకనినిజూపించుచున్నాను.

మున్ను శ్రీకృష్ణమూర్తి ద్వారకానగరంబునఁ దన పేరోలగంబున సుఖంబుగాఁ గూర్చుండి యుండెను. అత్తఱి ధర్మరాజుపంపున నొకఁడువచ్చి "అయ్యా! ధర్మరాజుగారు రాజసూయాధ్వరంబుఁ జేయఁదలఁచిరి, కాన వారికిఁ బ్రధానులగుమీరు తప్పకరం" డనిచెప్పి చనెను. అంత నారదమహర్షి వచ్చి "శిష్టరక్షకా! ప్రస్తుతమందు మిక్కిలి యెక్కువగా శిశుపాలుఁడు జనులను బాధించుచున్నాఁడు. కాన వానిని దునిమి శిష్టరక్షకుఁడనుబిరుదమును సార్థకమునుజేసికొను" మని చెప్పి కృష్ణునివీడ్కొనెను. అంతట నాశ్రీకృష్ణుఁడు రెంటిని విని యేమియుఁ జేయఁజాలక తనయన్నయగు బలరాముని, బినతండ్రియగునుద్ధవుని, బిలిపించి "గురువులారా! నాకుఁ బరమమిత్రుఁడగుధర్మరాజు, రాజసూయాధ్వరం బొనర్పఁదలఁచి నన్నుఁబిలువనంపినాఁడు. ఇఁక శిశుపాలుఁడు లోకమును నెక్కుడగా గందరగోళముఁ జేయుచున్నాఁడు

కాన వానిని దునిమి శిష్టరక్షకుఁడను బిరుదమును సద్గ్రకీర్తిము కలదానిగా నొనరించుకొనుమని నారదమహర్షి వచ్చి చెప్పిపోయెను. ఈ రెండును నాకాచరణీయములె. ప్రస్తుతమందు రెండు నావశ్యములైనవి. కాని వీనియందు ముందేదియుపేక్షణీయమో యేదియాచరణీయమో నాకుఁదెలియలేదు. కాన మీరు చక్కఁగా విమర్శించి చెప్పుఁడని వారినిఁ గోరెను. అంతనీలాంబరుఁ డాడంబరముతో రాజసూయాధ్వరగమనంబుపేక్షణీయంబనియు, శిశుపాలవధకార్యంబత్యావశ్యకానుష్ఠేయంబనియు నాశ్రీకృష్ణునకిఁ జెప్పెను. అంత నుద్ధవుఁడు బాగుగ విమర్శించి శాంతచిత్తముతో "కృష్ణా! ఆరాజసూయాధ్వరంబునకు సకలరాజులు రాఁగలరు. శిశుపాలుఁడు కూడ వచ్చును. నీవు నచటికేగిన ధర్మరాజెక్కువగా సంతోషించి తుదిదినమున సభామధ్యమున ముందుగా నిన్నుఁబూజించును. దాన నీదుర్మార్గుఁడగు శిశుపాలుఁడు చూచి యోర్వలేక నిన్ను దూలనాడును. అత్తఱి నీవు వానిని ఛేదింపవచ్చును. కాన రాజసూయాధ్వరగమనంబె నీవనుకొనిన రెండుపనులను నెఱవేర్పఁగలదు. కావున నటులఁజేయు"మని చెప్పెను. అంతఁ గృష్ణుఁడా యుద్ధవుఁడు విమర్శించి వచించిన విధముననె రాజసూయాధ్వరంబునకుఁ జనెను. ఆయన చెప్పినటులఁ దన్ను ధర్మరాజుపూజించెను. దానినోర్వలేక శిశుపాలుఁడు తిట్టెను. అంతఁ దాను శిశుపాలునిఖండించివైచెను. అంతటఁ గృష్ణుఁడు తన మనమున నుద్ధవవిమర్శనబుద్ధికి మెచ్చుకొని యెక్కువగా సంతోషించెను.

చూచితిరా? ఆశ్రీకృష్ణుఁడా యుద్ధవుఁడు వచించిన రీతిగా నడచుటఁ బట్టియేకదా తనపనుల రెంటిని నేకకాలమందు సాధింపఁగలిగెను. తనయన్న పలికిన విధముననే చేసినయెడలఁ దనపనుల నేకకాలమందిటులఁ గొనసాఁగించుకొనఁగలఁడా? కొనసాఁగించుకొనలేఁడు. కాఁబట్టియె, యిప్పటికా యుద్ధవునిఁ "విమర్శక చూడామణి" యనియు, మహా పరాక్రమశాలియగు నా బలరాముని "సాహసికుఁ" డనియు వచించుచున్నారుకదా. కాన మనము విమర్శనజ్ఞానము కలిగియుండుదము. మనకుఁ దెలియని విశేషసంగతులను సద్విమర్శకులనడిగి వారు వచించినపగిది మనము నడచుకొందము. మనము విమర్శనగ్రంథములఁ గావించి లోకోపకారుల మగుదము.

క. మిత్రత్వము శత్రుత్వముఁ
బాత్రతయు నపాత్రతయుఁ బరికించుచుచా
రిత్రుఁడు చిరతరగణనా
సూత్రముగ దాన నెల్ల శుభముల నొందున్.

(భారతము.)

---

# వివేకము.

దేహమును నాత్మయును విభాగించు జ్ఞానమును, సుగుణ దుర్గుణములను విచారించుటయును వివేకమనఁబడును.

ఈవివేకము, స్వకీయములగు తప్పులను నగుపఱచి వానిని దిద్దుకొనునటులఁ జేయుచుండును. మఱియుఁ బరకీయుల తప్పులఁ గూడ సవరణఁ జేయఁ బాటుపడుచుండును. ఇదియె యసాధ్యమగు నాపదనుండి రక్షించును. ఇదియె న్యాయాన్యాయవిచారణఁ జేయుచుండును. యిదియే యింద్రియ నిగ్రహత్వము సంపాదింపఁజేయును. ఈవివేకమె నీచమార్గగతముల గుమనములను ద్రిప్పి వానిని సన్మార్గయుతములుగాఁ జేయును. ఇదియెసుఖదుఃఖసమదర్శి. ఇదియె సచ్చిదానందమార్గదర్శి. కాన మానవులకిది యాచరణీయంబు.

ఈవివేకముకలిగినవారలను వివేకులనియనియెదరు. వీరు ప్రారంభించినపని యంతరాయములులేక చక్కఁగా నెఱవేఱును. వీరుపట్టినదియె బంగారమగుచుండును. అప్పటున వీరు గర్వించరు. మఱియు వినయముగా నుండుదురు. కాఁబట్టి వీరు జగజ్జనవంద్యులు.

అనర్ఘంబగు నీవివేకము లేనివారలు విద్వదాదరణీయులు కానేరరు. ఎందువలననన? ఈవివేకరహితులు దురాశకు లోనగుచుందురు. గర్వముఖస్తుతులకుఁ బాల్పడుచుందురు. తాము పట్టినకుందేటికి మూఁడేకాళ్ళని వితండవాదముఁ జేయుచుందురు. కర్తవ్యమునకుఁ గాలుఁద్రిప్పుచుందురు. యుక్తాయుక్త విచారణశూన్యులగుచుందురు. ఇవియవియననేల? ఈ వివేకశూన్యులు దుర్గుణములకెల్లఁ దల్లియిల్లువలె నుందురు. కాన వీరు జగన్నింద్యులు.

వివేకులు న్యాయముగాఁ బ్రతివిషయమును జక్కఁగా బరిశీలించి గ్రహించు చుందురు. దాన విశేషలాభములు కలవుగదా. ఇఁక వివేకదూరులన్ననో యటుల నొనరించుట కుపేక్షించు చుందురు. ఉపేక్షఁజేయుట బహ్వనర్థదాయకము కదా. కాఁబట్టి మనము వివేకముకలిగియుండుదము. ఇది భావిభావుకసూచకము. ఇది పూర్వులనన్ముయంగడిన కట్టల నమ్మనీయదు. ఈవివేకమువలన ననేకసుగుణములు పట్టు వడును. మనమావివేకము కలిగియున్న యెడల దుఃఖములను బొందము. మన మొకవేళ హానిని బొందినను దీనిచేత దాని నవలీలగాఁ బోఁగొట్టుకొనఁ గలము. మనము దీనినలవరించు కొనుటకు సుజనసహవాస మొనరించవలెను. వివేకము కల్గి యున్నవారలు విశేషసౌఖ్యములఁ జెందఁగలరు.

ఇటుల వివేకమున విశేషసౌఖ్యముఁ జెందినవారలలో నొకనిని జూపుచున్నాను.

తొల్లి ధర్మరాజు నలుగురుతమ్ములతోఁ గొండొక కారణంబున నరణ్యవాసముఁ జేయుచుండెను. ఇటులుండ నొకసమయమునఁ దననలుగురుతమ్ములకుదాహమాయెను. అంత ధర్మరాజు జలమునుదీసికొనివచ్చుటకై మొదట నకులునిఁ బంపెను. అంత నానకులుఁ డొకచెఱువుఁజొచ్చి నీరుఁ ద్రాగుటకోడనే యచటనే పడిపోయెను. అంతట ధర్మరాజు "నకులుఁడుదకముఁదీసికొని యింకను రాకపోయెను. ఇది యెర న్యాయముగదా" యని భయమందుచు నింకొక తమ్మునిఁబంపె

ను. వాఁడటులనె రాకపోయెను. మరల మఱియొకతమ్ముని
బంపెను. వాఁడటులనె రాకపోయెను. మఱియు నింకొక్క
తమ్ముని బంపించెను. వాఁడటులనె రాకపోయెను. ఇట్లునలు
గురుతమ్ములెంతసేపటికి సలిలమును దీసికొనిరాకపోవుటఁగాం
చి ధర్మరాజుగూడఁ బయలుదేఱి యాచెఱువుదరిఁ జేరెను.
అచ్చటఁ దనతమ్ములందఱు నిర్జీవులై పడియుండుటఁజూచి య
ధికముగా దుఃఖించుచుఁ గారణమూరయుచుండెను. ఇంతలో
నాకసమునునుండి "ఇచటఁబడియున్నవారందఱు చెఱువునకు
నాయకుఁడనగు నాయనుజ్ఞలేనిదే ప్రవేశించి యీవిధమున
నైరి. కాన నీవైనను నేనడిగినప్రశ్నములకు సదుత్తరముల
నిచ్చి యిందుఁబ్రవేశింపు"మను మాటలు కొన్ని శ్రవణ
గోచరములయ్యెను. అంతట ధర్మరాజు మగుడ "సరే"యని
యుత్తరమొసఁగెను. అంతఁ దత్తటాకనాయకుఁడు ముప్పది
రెండుప్రశ్నముల నాధర్మనందను నడిగెను. వానికిఁ దగిన
యుత్తరముల ధర్మరాజు వచించెను. అంత నాచెఱువునకధి
పతియగుయక్షుఁడాతని యుత్తరములకు మెచ్చి "ధర్మజ్ఞా!
నీవు నీరుఁద్రాగుము. మఱియు నిచటఁ బెద్దనిద్దురఁ జెందియున్న
యీనలుగురిలో నొకనిని బ్రతికించఁగలను. కాన నీకిష్టుఁడె
వఁడో చూపింపు"మని యడిగెను. అంత ధర్మరాజు, నకు
లుని నాకిష్టుఁడని చూపించెను. అంత నాయక్షుఁడు బలవం
తులగు భీమార్జునులనుగోరక నకులునిఁగోరుటకుఁ గతమే"
మని యడిగెను, అంత ధర్మరాజు "మహాత్మా! కుంతీపుత్రు

లమగు మామూపురలో నేనొకఁడనుంటిని. మీరు వచించిన పగిదిఁగోరిన మాదీ ౧౪ పుత్త్రులలో నొకరుగూడఁ గన్పడరుకదా. అటులఁజేయుట వివేకిలక్షణమా?" యని చెప్పెను. అంత నాయక్షుఁ డీతనివివేకమునకు మెచ్చియతఁడుకోరకపోయినను నతనినలుగురుతమ్ములను బునర్జీవితులను చేసెను.

కంటిరా! ఆధర్మరాజాయక్షుని బలవంతులగు భీమార్జునులలో నొకరినిగోరక సామాన్యుఁడగునకులునిఁ గోరిన దేల? వివేకిలక్షణము కాబట్టియొకదా. ఆవివేకమునకే కదా మెచ్చి యాయక్షుఁ డాధర్మరాజు కోరకపోయినను నతని నలుగురు తమ్ములను బ్రతికించినది. కాబట్టి యెవరైనను గష్టమువచ్చినను సుఖమువచ్చినను వివేకమును విడువకుండి రేని వారికి సకలసౌఖ్యములు చేకూరును. కాన మనము వివేకమునువిడువక కార్యాకార్యములను వివేకించుకొనుచు సుఖముగా నుందుదము.

ఆ. వె. విను వివేకమనెడి ♦ వింతగొడ్డలిచేత
నల యవిద్య యనెడు ♦ నడవినఱికి
తెలివియనెడుగొప్ప ♦ దీపంబుఁజేఁబట్టి
ముక్తిఁ జూడవచ్చు ♦ మొనసివేమ.

# ధనము.

సంతోషము పెట్టునది, లేక, ధాన్యమువలనఁ గలిగినది ధనమనఁబడు.

ధనము ప్రతివాని కావశ్యకము. ఇది లేనివానిని దరిద్రుఁడని పలికెదరు. వీనినెవరును దగ్గఱఁజేరనీయరు. వీడు విద్యావంతుఁడైనను గణనసేయరు. ఈదరిద్రుఁడు పచించు మంచిమాటలనుగూడ నావలద్రోసివేయుచుందురు. ఈతని కోపమితరుల నెంతమాత్రమును సాధించనేరదు "పేదకోపము పెదవులచేటని" వినియుండలేదా? ఈతఁడు మంచిపనిఁ బ్రారంభించినను జెడుపనియని చెప్పుచుందురు. ఈదరిద్రునిగని కన్నతల్లి నిందించుచుండును. తండ్రి సంతసించఁడు. సోదరులితనితో మాట్లాడరు. తానుకన్నకుమారుఁడు తన దగ్గఱకు రాఁడు. సేవకులీదరిద్రునిఁ దిరస్కరించుచుందురు. సంభాషించిన నెక్కడ డబ్బువడుగఁ గలఁడోయను వెఱపుచేత నెచ్చెలులు పెడమొగముపెట్టుకొని మాట్లాడక యుందురు. ఇంతయేల? ఆదరిద్రుని భార్యయుఁగూడ నాసిర్భాగ్యునందుఁ బ్రేమగానుండదు. ఈతనితప్పు గోరంతయున్నఁ గొండంతఁజేయుచుందురు. ఈదరిద్రునిఁబట్టి ప్రతివాఁడు చెవులబట్టి యాడించుచుండును. ఈతని కెంతమాత్రము సుఖము లేదు. వీఁడుతనజీవిత మెప్పుడు పోవునాయని యంతఃకరణంబునఁ జింతించుచుండును. చూడఁ జూడ నీతని కష్టము

లనిర్వాచ్యములునుదుర్గమములు నగుచున్నవి. కాబట్టి యట్టి నికృష్టకష్టముల కునికిపట్టగు నీదారిద్ర్యమును బలు తెఱంగులఁబోఁగొట్టుకొనుచుఁ బ్రతివాఁడును ధనమును సంపాదింపఁ గడంగవలయును.

ఈధనమార్జించుటకు మూఁడుమార్గములు కలవు.

చక్కఁగా నొకవిద్యయందుఁ బాండిత్యము సంపాదించి వివేకియై దానినిఁ బ్రాజ్ఞులసమక్షమునఁ దెలియబఱచి వారిచే ధనాదులను మెప్పుగాఁ బడయుట. ఇది మొదటితరగతి. ఇది యన్నిఁటిలోనికి నుత్తమము. వ్యవసాయము మొదలగువృత్తులందుఁ గష్టించి ధనమును సంపాదించుట. ఇది రెండవతరగతి. ఇది మధ్యమము. ఒకరిజుట్టునకు మఱియొకరిజుట్టునకు ముడిబెట్టి వారిద్దఱను తగవులాడునటులఁ జేసి తానువారిద్దఱిలో నొకరితట్టుచేరి కొలఁదిదినములైన తరువాత రెండవవానిపక్షముగూడఁ జేరి వానికిఁ దగినమాటలు వానికి వీనికిఁ దగినమాటలు వీనికిఁ జెప్పుచు లంచముగొట్టి సంపాదించుటయు జూదము మోసము దొంగతనము మొదలగు చెడుగుపనుల వలన నార్జించుటయు. ఇది మూఁడవతరగతి. ఇది యన్నిఁటిలోనికి నధమము.

ఈయధమవృత్తిచే సంపాదింపఁబడిన ద్రవ్యము సజ్జనత్యాజ్యము. కానఁ బ్రతిమనుజుఁడును పైనదెలిపిన మొదటిరెండు తరగతులవలననే ధనమార్జింపవలయు. ఈధనము పండితపామరజనసేవ్యంబు. ఇదియె గర్వోద్దీపకంబు. ఇదియె

ఇదియె యైహికాముష్మిక ఫలసాధనంబు. ఇదియె యుపయో గరీతినిఁ గీర్త్యపకీర్తి సాధకంబు, ఇదియే యనేకుల నుపశ్లాఘించుచుండును. ఇదియే సోదరులనువిభాగులనుగాఁ జేయును. ఇదియె జుట్టులు జుట్టులు పట్టు కొనుటకుఁ బురికొల్పుచుండును. ఇదియె గొప్పవారలతోడ స్నేహమొదవించును. కాఁబట్టియెమనవారలు "సర్వేగుణాఃకాంచనమాశ్రయంత్రి" అనఁగా "సకలగుణములు బంగారము నాశ్రయించుచున్న" వని చెప్పిరి. ఎవనికి బొక్కస మెక్కువగా నుండునో వాఁడే బుద్ధిమంతుడు. వాఁడే పండితప్రకాండుఁడు. వాఁడే గుణగ్రహణదక్షుఁడు. వాఁడే దర్శనీయుఁడునగుచున్నాఁడు. ఆధనవంతుఁడు కొలఁదిగా నొకప్పుడొక మంచికార్యమును జేసినయెడల దానినిఁ జేకొని యనేకులు వారినిఁజేరి వందిమాగధులవలె స్తోత్రముఁ జేయుచుందురు.ధనహీనుఁ డెంతవిద్యావంతుఁడైనను మతిమంతుఁడైనను సజ్జన సహాయము వలన నెట్టువంటిమంచి కార్యములఁ జేసినను వాని నితరులు నుతించకపోవుటయెకాక యేవగించుకొను చుందురు. పాడిగలిగిన బఱ్ఱెను జక్కఁగాఁజూచి దానికి గడ్డిమొదలగు వానిని బెట్టినటులఁ బాడిలేని పశువును జూచు చున్నారా? చూచుటలేదు, బెల్లమెక్కువగా నెక్కడ నుండునో యక్కడనే యీఁగలు చీమలు చేరునుగాని రిత్తచోటుల నవి గుమికూడునా? కూడవు. అటులనే ధనమెచటనుండునో యచటికి జను లేగుదురు కాని దారిద్ర్యవంతుని జేరుదురా? చేరరు. దారిద్ర్యము గలవానిని

చేరఁబోయినను ప్రీతిగాఁ జూచుచుందురని యనుకొందమన్నను నదియు లేదు. కాన దరిద్రుఁడు జీవించి యుండుటయుఁ బ్రయోజనము లేదు. "నిర్ధనస్సు మృతస్సమ" యని వినమె. కావున మంచిమార్గమున నత్యాశవిడనాడి ధనమార్జించవలయును.

ఈధనమును దుష్కార్యములకు వినియోగించక తాను చక్కఁగా ననుభవించి మిగిలినదానిని లోకోపకార కార్యములకుపయోగించుచుండవలెను. అంతియకాని ప్రభువులు తక్కఁ దక్కినవారలు విశేషముగా డబ్బు నిలువనుంచఁ గూడదు. ఎందువలన ననఁ? ఎప్పుడు ధనమును నిలువనుంచఁ దలచితిమో యప్పుడె దానిని భద్రముగా దాఁచి పెట్టవలయును గదా. ఆదాఁచిపెట్టుటయందుఁ గొంచె మశ్రద్ధ వహించితిమా యది ముచ్చుల చేతులఁ జిక్కును. దానివలన నితరములగు పనులు పటాపంచలైపోవును. వెండియుఁ గొంచెము డబ్బు నిలువయున్నదని యొక యసూయాపరుఁడు వినెనా వాఁడు వెంటనె దానినపహరింప మాయోపాయములఁ బన్నుచుండును. కాన విశేషముగా డబ్బుదాచుట సామాన్యుల కనర్థదాయకమని చెప్పవచ్చును. కొందఱు కులక్రమాగతధనము నిలువయున్నను నష్టములేదని చెప్పిరి. కాని ప్రభువులకుఁ దక్కఁ దక్కినవారల కాపత్కరమనియె తోఁచెడిని.

ఈధనవంతులు, వివేకులై ముఖస్తుతులకులొంగక యుక్తాయుక్తవిచక్షణదక్షులై తమధనము నుపయోగించుచుఁ గీర్తిఁ గాంచుచుండవలెను.

ఈవిషయమునఁ బూర్వులలోనుండి యొకనిఁ జూపెద.

తొల్లిసకలాలంకారాలంకృతంబగు నలకయానపురంబున కధినాథుఁడైనకుబేరుఁ డాదిని మంచిమార్గమున ధనమును సంపాదించెను. అటుతరువాతఁ దానెక్కువగాఁ గష్టించక పోయినను నాధనమునానాఁటికి వృద్ధిఁబొందుచుండెను. క్రమక్రమముగా నవనిధులుచేరెను. నవనిధినాథుఁడైనయీకుబేరుఁడు వివేకియై యొకల ధనము దేనికి నుపయోగింపవలయునో యానంగతిఁ దెలిసికొనుచు బాగుగా నుపయోగించుచుండెను. ఇతఁడీ ధనమువలన యక్షులను, గిన్నరులను, గుహ్యకులను, మొదలగుబీదవారినిఁ గాపాడుచుండెడివాఁడు. ఈధనమువలననే యుత్తరదిశకు దానధిపతియయ్యెను. శివునివలన నే రాజరాజని పేరుగాంచెను. ఇతఁడు ధనమెక్కువగా దానముఁ జేయుచున్నందువలనను ధనదుఁడనియు నాపేరుగాంచెను. మఱియు నితఁడీధనమువలననె మహానుభావుఁడగు పరమేశ్వరునితోడ స్నేహమొనరించెను.

చూచితిరికదా. ఆకుబేరుఁడీధనమువలనఁ బొందినలాభములన్నియు; కాన "ధనమూలమిదంజగ" త్తనుమాటను జ్ఞాపకముంచుకొని యత్యాశవిడనాడి మంచిమార్గమున ధనమార్జించి గర్వించక దానిని దుష్కార్యములకు వినియోగించక మంచిపనులకుపయోగించుచుఁ గీర్తిగాంచుచుండవలెను.

క. కలిమియ చుట్టలఁ జేర్చుం
గలిమియ చెలులను ఘటించుఁ గలిమియ శౌర్యో
జ్జ్వలుఁడనిపించుం గలిమియ
పలువురు సద్బుద్ధియనఁగఁ బరఁగంజేయుక్
(భారతము)

## ఐకమత్యము

జనులొకపనియందున భిన్నభావములు లేక చేరికగా నుండుట యైకమత్యమనబడు.

ఈ యైకమత్యము పరస్పర ప్రేమ కలిగించుచుండును. ఇదియె దిగంతములఁ గీర్తిని వ్యాపింపఁజేయుచున్నది. ఇది సర్వత్ర సాధకము. కాన దీని దప్పక జనులవలంబించవలయును. కాని యీ యైకమత్యమును మంచిపనులయందె యుపయోగించుచుండవలెను. అటులఁ జేయుటయే శ్రేయస్కరము. ఐకమత్యము లేనివారలు మహాపరాక్రమశాలులైనను గానరానివారు కాఁగలరు. మన మైకమత్యము కలిగి యుండనిచో యేపనిని చేయజాలము. మనము విస్తరియందున్న బువ్వనుంచుకొని మన చేతులైనను వేళ్లు నొకచోఁ జేర్చనిచో మనమా యన్నమును భుజింపగలమా? లేము. కాబట్టి ప్రతివిషయమునను నైకమత్యము కావలయును.

ఈమైకమత్యమునన్నదమ్ములును, దండ్రికొమరులును నత్తకోడండ్రును, భార్యాభర్తలును, మఱియునింటిలోనివారందఱును గలిగియుండినయెడల గృహమునఁగలతలులేక గృహకృత్యములఁ జక్కఁగానడుపుకొనఁగలరు. వారలకుఁ దమగృహమె భూతలస్వర్గముగా నొప్పుచుండును. ఈమైకమత్యముకలిగినవారిని నితరులెంతమాత్రమును భాధింపఁజాలరు. కానఁబ్రతివాఁడు నీమైకమత్యమును గలిగియుండవలెను.

"ఉష్హా" యనియూఁదినంతమాత్రమున నూరుదాటిపోవునంతబలముగలిగినవారలు కొందఱైకమత్యముతో నుండినయెడల వారలే జగజెట్టినిఁగూడనోడించి తమకాళ్లనుబట్టుకొనునటులఁ జేయఁగలరు. అల్పములగుకొన్నిగడ్డిపోఁచలుకలిసి బలిష్ఠమగునొకయేనుఁగునుబట్టి కట్టివేయుచున్నవికదా ఈమైకమత్యముకలిగినవారలు బలములేనివారైనను నొకపనియందొకటెయభిప్రాయముకలిగియుండిన వీరాపనియెంతగొప్పదైనను జిటికలోదానినిజేసి కృతార్థులుకాఁగలరు.

ఇట్లైకమత్యముతో నల్పబలులు గొప్పపను లొనరించి కీర్తిని గడించిన వారు కలరు. వారలలో నొకసమూహమును జూపించుచున్నాను.

తొల్లి వానరు లల్పబలము కలవారైనను జాలమంది యొకటిగాఁజేరి యగాధంబగుసముద్రముపైఁ గట్టవేసి లంకకు మార్గమేర్పరిచిరి. అటుతరువాత రామకార్యార్థమై లంకాపట్టణముఁజేరి మిక్కిలిబలముగలవారును, బగలుచూచినరా

తిరి కలలోనఁగుపడి గుండెలు జల్లుమనిపించెడిపికారాకారముక లిగినవారును, మాయాయుద్ధము తెలిసినవారును, నగురాక్షసులతో యుద్ధమొనరించి వారినందఱిని జెండి చెకపికలాడిరి. అంతట నీవానరు లసాధ్యంబగు నా శ్రీరామకార్యమును నెఱవేర్చి కృతార్థతఁగాంచిరి.

కనుగొంటిరా! ఆవానరులు కొంచెపుబలముఁ కలవారైనను వేలకొలఁది యొకటిగాఁ జేరుటవలనఁగదా యగాధంబగునబ్ధికి మహత్తరంబగునొకవంతెన వేసి దానివలన లంకాపట్టణముఁజొచ్చినది. మఱియు నీయైకమత్యము వలననెకదా యావానరులు పటిష్ఠులగునారక్కసులను గొట్టి కోలాహలముఁజేసి శ్రీరామకార్యము నెఱవేర్చి కృతార్థతఁగాంచఁగలిగినది. కాఁబట్టి మనమైకమత్యముకలిగి గొప్పగొప్పపనులఁజేసి గొప్పవారలచేత మెప్పునుబొందుచుందము.

తే. గీ. బలముఁగలవానిఁ బలువురు • బలవిహీను
లొక్కటైకూడి నిర్జింతు • రుత్సహించి
మధువుఁగొన నుత్సహించిన • మనుజుఁ బట్టి
కొట్టి నిర్జించు మధుకర • కులమునట్లు.

(భారతము.)

---

# శ్రద్ధ.

తాననుకొనిన కార్యము నెఱవేఱువఱకుఁ బట్టుపట్టి యుండుట "శ్రద్ధ" యనఁబడును.

ఈశ్రద్ధయనునది ప్రతికార్యమున కత్యావశ్యకమైనది. ఇదిలేనియెడల నేపనియుఁ గొనసాఁగదు. మిక్కిలి బుద్ధిమంతుఁడుకూడ నీశ్రద్ధ నవలంబింపవలసియున్నది. వీరవలంబించనియెడలఁ దామనుకొనినకార్యము నెరవేఱదు. విద్యార్థులీశ్రద్ధనవలంబింపనియెడల వారికి విద్యరాదని దృఢముగాఁ జెప్పవచ్చును. మంచినిక్కుటద్దములైనను వెనుకఁ గళాయినిఁ బొందనియెడల నితరుల ప్రతిబింబములఁ జూపఁగలవా? లేవు. అటులనె యెవరెంతగొప్పవారైనను శ్రద్ధను బూననియెడల నేమియుఁబ్రయోజన మందనేరరు. విద్యార్థులీశ్రద్ధనెతాల్చినయెడల విద్యఁ జక్కఁగాఁ బొందఁగలరు. శ్రద్ధకొలఁది విద్య వచ్చును. కాన విద్యార్థులందఱు తప్పక దీనిని గల్గియుండవలెను. మతిమంతుఁడు తాను చలనములేక శ్రద్ధకలిగియాలోచించుచుండిన వానికిలాభముగల యొకయుపాయము తోఁచును. ఇట్లాలోచించుసమయమునఁ దనమనము చలనమొందుచుండెనేని నిక్కమగులాభముగల యొకయుపాయమును గ్రహించనేరఁడు. కాఁబట్టి విద్యార్థులు, మంత్రులు,గార్యారంభకులు, తప్పక యీశ్రద్ధనుగల్గి యుండవలెను. దానఁ బ్రతిష్ఠఁబొందఁగలరు.

ఇటుల శ్రద్ధవలనఁ బ్రసిద్ధివహించినవారలు చాల మందికలరు. వారిలో నొకనిని జూపించుచున్నాను.

మున్ను "హిరణ్యధన్వుఁ" డను నెఱుకరాజునకుఁ గొడుకగు "నేకలవ్యుఁ" డనువాఁడు, ద్రోణాచార్యుల ప్రసిద్ధిని విని యాయాచార్యుల సమీపమునకువచ్చి "ధనురాచార్యా! నేను శ్రద్ధగాఁ దమసమీపమున ధనుర్విద్య నేర్చుకొనవలయునని యిష్టపడుచున్నాను. కాన నన్నుగ్రహించుఁ"డని కోరెను. అంత ద్రోణాచార్యులు, వానినిజోయవానికుమతునిగా నెఱింగి వానివేఁడికోలు నంగీకరింపకపోయెను. అంత నాయేకలవ్యుఁ డాయాచార్యుల యానతిఁగైకొని యడవికేగి యొకచోఁ గూర్చుండి మృత్తికతో ద్రోణాచార్యరూపమును జేసికొని దానినె గురువుగాభావించుకొని నమస్కారాదుల సలిపి మిక్కిలిశ్రద్ధతో నెల్లప్పు డస్త్రవిద్య నభ్యసించుకొనుచుండెను. అంతట నొకసమయమున నాయడవికిఁ గురుకుమారులందఱు భటసమూహముతో వేఁటాడుటకై వచ్చిరి. ఆభటసమూహమునం దొకనికుక్క ప్రత్యేకముగా నొకఁడె మిక్కిలిపట్టుదలతో ధనుర్విద్యనభ్యాసముఁ జేసికొనుచుండెడి నాయేకలవ్యునిఁజూచి మొఱిఁగెను. అట్లు మొఱుఁగుట నాయేకలవ్యుడుఁ జూచి యాకుక్క మొగమున నైదుబాణములను, నొకయమ్మును వేసెను. ఆబాణములు, దూరమగానున్నకురుకుమారుల సమీపమునకుఁ బోయెను. దానిఁజూచి వీఁడెవఁడో కనుగొంద

మని యల్లన నీయేకలవ్యునిఁ జేరిరి. అంతనిద్దఱొకరిమొగము నొకరు చూచుకొనిరి. అంతట నాయేకలవ్యుని దృష్టికి శర లాఘవంబునకు మెచ్చుకొని "నీవెవ్వఁడ"వని వానినడిగిరి.అం తట వాఁడు: నేను హిరణ్యాధన్వకొమరుఁడను. ద్రోణాచార్యు లశిష్యుఁడను.న"న్నేకలవ్యుఁ"డని లోకము:వాకొనుననియు త్త రమొసఁగెను. అంతట నాకురుకుమారులంద ఱటనుండి బ యలుదేఱి ద్రోణునిసమీపమునుఁజేరి జరిగినసంగతినంతయు నివేదించిరి. మఱియు నర్జునుఁడొకనాఁ డేకాంతమునఁ దన గురువుదరిఁజేరి "గురువరా! విలువిద్యయందు నన్నుఁబ్రసిద్ధుని గాఁ జేసెద నని యిదివఱకు వచించియుంటిరి. నేనడవికి మొ న్నటిదినము పోయినప్పుడు నిన్నును నన్నును మించినధనుర్వి ద్యావిశారదుని నొకయెఱుకను జూచితిని.వాఁడు నీశిష్యుఁడఁ ట.నాతోనావిధముగఁజెప్పి యీవిధముగ మీరు చేయుటపా డియా"?యని యడిగెను. అంత ద్రోణుఁ డాయర్జునునితో "వానినిజూతమురా"మ్మని యిద్దఱుకలిసి యడవికరిగి యాయే కలవ్యుని దరిఁ జేరిరి. అంతనాయెఱుక యాద్రోణాచార్యునిఁ గాంచి నమస్కరించి స్వామీ! మీశిష్యుఁడను. మిమ్మారా ధించి యింతవాడ నైతిని. కాన గురుదక్షిణ నివ్వఁ దలఁచితి. కానఁగోరుఁ"డని పలికె. అంత నాద్రోణుఁ డాయెఱుకనుబొ టనవ్రేలిని గురుదక్షిణగానిమ్మని కోరెను. అంత నాయెఱుక యటులనె చేసెను.

చూచితిరా! ఆయేకలవ్యుఁడు తన్ను బోయవాఁడని

యాదో్రణా చార్యుఁడు చేకొనకపోయినను విలువిద్యయందు శ్రద్ధకలవాఁడగుట బట్టియొకదా స్వకీయజనమును విడిచి భయంకరమగు నడవికేగి మన్నుతో నాదో్రణుని రూపమును జేసికొని దానినె గురువుగాఁ దలఁచికొని శ్రద్ధతో స్వయముగా నేర్చుకొని త్రిలోకములందు విలువిద్యయందుఁ దానె మేటి యని ప్రసిద్ధికెక్కఁ గలిగినది. ఆప్రసిద్ధియివినియొకదా యర్జునుఁ డును దో్రణుఁడును నంతవనిఁ జేసినది. కాఁబట్టి శ్రద్ధనుబట్టి విద్యయుండును. ఒకవిద్యయే యననేల? సమస్తమునీశ్రద్ధను బట్టియె యుండును. కాన మనము శ్రద్ధవలన విద్యాదులఁబొంది ప్రసిద్ధినిఁ బొందుదము.

క. శ్రద్ధ రవితనయ సాత్త్వికి
బోద్ధవ్యా వాప్తిశుభముఁ • బొనరించుమన
శ్శుద్ధి స్వరూప దానిఁ బ్రి
బుద్ధుఁడు వాటించు జూవె • పురుషాత్మికగా.
(భారతము)

---

# దుర్జనులు, వారి గుణములు.

చెడ్డగుణములుకలవారు దుర్జనులని చెప్పఁబడుదురు.

ఈదుర్జనులు విద్యావంతులైనను బలవంతులైనను ధనాఢ్యులైనను గులీనులైనను త్యాజ్యులు. ఎందువలననన? వీరు చేయు చేఁతలఁబట్టి. వారు చేయుచేఁతలెవ్వియనిన? మా

టికి మాటికిని బొంకులాడుచుఁ బ్రతిజ్ఞలుసేయుచుఁ బ్రమాణములఁజేయుచు నితరుల నమ్మించుటకై యనేకవిధములఁ బాటుపడుచుందురు. వీరలు, తమపని యెవనివలనఁగొనసాఁగ వలెనో యది తెలిసికొని వానినిజేరి పరిణామములాచరించి మిక్కిలి తియ్యనిమాటలతో మాటలాడుచుఁ బయోముఖవిష కుంభములభాతి భాసిల్లుచుఁ గపటవినయములఁజూపుచు విశేషముగా నాతనియందు భక్తికలవారుగా నటించి యాసుజనునివలనఁ దమపనిఁగొనసాఁగించుకొనుచుందురు. అంత నీకుజనులు తమపనినెఱవేర్చినవారలనే కృతఘ్నతకలవారై పలుతెఱఁగుల బాధించుచుందురు. ఈకుమతులు సాధ్యమైన కొలఁది నితరులను దమచేతఁజిక్కించుటకై యత్నింతురు. ఒకవేళ వారు తమచేతులఁజిక్కనిచో వేఁడికోలుచేనైనను జిక్కించుకొందురు. "అందినశిఖయు నందకున్నఁగాళ్ళు" నని వినియుండలేదా?

ఈకుచరిత్రులాదినిఁ దమపని కొనసాఁగుసంత వఱకుఁ గడువినయముగానుండి పిమ్మట మేమే శ్రేష్ఠులమని నిక్కుచుందురు. వీరికుపకారమొనరించినవారెదలో "ఏకుమేకయినదే" యని చింతించుచుందురు. కాఁబట్టి దుర్జనులకెవరైనను సాయముఁజేయఁగూడదని తెలిసికొనుఁడు. ఈదురాత్ములకొకపరిమంచిబుద్ధిపుట్టినటులఁ గానుపించినను వారినినమ్మఁగూడదు. పాపటకాయ పైకిబాగుగాఁ గానుపించినను లోపలిచేదు యెచటికవగును? కానఁనొకపరి వారుమనకు మంచివారుగాఁ

గాన్పించిననునమ్మఁగూడదు. వీరినినమ్మియుండుట "కుక్క తోఁకఁబట్టుకొని గోదావరియీఁదుటయో" మఱియు వీరికి సాయముఁజేయుట "పామునకుఁబాలుపోయుటయో".

"అతివినయం ధూర్తలక్షణః" మ్మనఁగా ధూర్తుని యొక్కలక్షణ మతివినయమనియర్థము. కాన సామాన్యముగా మిక్కిలివినయమునటించువారు దుర్జనులై యుందురని చెప్పవచ్చును.

ఈకుచరితులు తమభార్యలు మహాపతివ్రతలైనను, సంతానవతులైనను, సౌందర్యవతులైనను, సద్గుణవతులైనను, నరకునేయుక యాయమ్మల ననాదరణదృష్టితోఁజూచుచుందురు. వీరలు తమయుద్దేశమగునంతవఱకుఁ గడుప్రియులవలె నటించి పిమ్మట విషపూరితంబులగుకోరలుగలిగిన సర్పముమాడ్కి నాశనముఁజేయఁజెలరేఁగుచుందురు. ధైర్యమువీడి భయముకలవారై తమ్మునుగొనియాడుచువచ్చి శరణాగతుఁడగు నతిథినిఁగాని యభ్యాగతినిఁగాని యీకుచరితులు నిర్దయులై వారలఁ జంపనుంకించుచుందురు. అధికప్రసంగములేక యభిమానధనులై యుండు పెద్దమనుష్యుల నీచుర్మార్గులు మందులఁగాభావించుచుందురు. సద్వ్రతమునందు శుచికలవారై యొకఁడుండుటఁగాంచి వానిని వీరు "అబ్బా! లేనిపోని యీడంభాచారములెందుకో! తెలియకున్న" దని యీసడించుచుఁ బక్కుమాఁదురు. సాధుని నిష్క్రియునిగాను, మునినిముచ్చుగాను, బలవంతుని గర్వవంతునిఁగాను, మంచి

యుపన్యాసకుని వాచాటునిగాను, సద్విమర్శకుని రంధ్రాన్వేషణ తత్పరునిగాను, బరిగణించుచుందురు.

వీరలు నిష్కారణముగా గొప్పవారలను బీడించుచుందురు. కసవుసీరుమొదలగువానిచేఁ బ్రతుకు చేఁపలనునిష్కారణముగా బోయువారు పీడించుటలేదా?

ఇట్లు నిష్కారణముగాఁ బెద్దలని పేరుఁగాంచిన వారినిఁ జిక్కులఁ జిక్కించుట కడు నన్యాయము. వీరలు యమగదానుగ్రహపాత్రులు కాఁగలరు.

ఈదుర్జనులు తమపని కొనసాఁగనియెడల నత్తజిప్రాక్తన ఫలమిదియని తెలిసికొనక దైవమునుదూరుచుందురు. ఇటుల దూఱుట" తుంటినిఁ గొట్టినపండ్లు విరిగిన"వను లోకోక్తికిసరిపోవుచున్నది. వీరలు గురిగింజవలెఁ దమతప్పులఁ దాము తెలిసికొనక యితరుల తప్పులవెదకుచుందురు. ఈకుమతులకు దైవవశమునఁ గొంచెమున్నత పదవిలభించెనేని "నీకనాకేమిరా" యనిగర్వించి తమక్రిందివారలను నెక్కువగా వీరలు వేధించుచుందురు. ఈకుచరితులు, దైవమునందును, రాజునందును, జననీజనకులందును, మహాపతివ్రతయగు భార్యయందును, సద్గురునందును విశ్వాసవిహీనులై వారినిఁ దృణీకరించుచుందురు.

ఈదురాత్ములకు, విద్య, ధనము, బలము, నీమూఁడు సుగుణములు మదోద్రేక కరములగుచున్నవి. ఇవియెసుమతులకు సాధుత్వమార్గదర్శకములు.

సుజను లేదేని యొక మంచికార్యమును జేయుచుండిననీ కుచరితులు దానినెట్లైన నాఁగింపవలె నను యుద్దేశముతో విశ్వప్రయత్నము లొనరించు చుందురు.ఇతరు డు గొప్పదశలో నున్నాడని విని సహించక యీదుర్మార్గులాదశనుండి వానినిఁ దొలఁగింపఁ జేయుటకుద్యమించు చుందురు. ఎదుటివారిపొయ్యి చక్కఁగా మండుచుడిన, దానిని జూడలేక తనపొయ్యిలో నీళ్లుపోసికొనినాఁడట" యనులోకోక్తి విన లేదా?

ఈదుష్టులు లోకాపవాదకు భయపడరు. బొంకుటకుఁ గొంకరు. గురుదారలనైన నంటుటకుఁ జంకరు. సురాపానాదులఁ జేయుటకు శంకించరు. లోభత్వమునఁ గ్రోధమునఁ దగ్గియుండరు. కృతజ్ఞత యెట్టిదో యెఱుఁగరు. జూదమాడుటకతిశ్రద్ధకలవారు. వీరుచేయుపనుల వేఱువేఱుగాఁ జెప్పనేల? ఈ కుమతులకుఁ జేయఁదగని పనియె లేదు. వీరలు తేనెపూసిన కత్తులవలెఁ బ్రకాశించుచుందురు.వీరలు ప్రతివాఁడును, దమవలెనుండుటకుఁ బ్రయత్నములఁ జేయుచుందురు." తాఁ జెడ్డ కోతివనమెల్లఁ జెఱచె" ననులోకోక్తి వినవె? ఈదుర్జనులుపైకి మేడిపండువలె మేలిమిగాఁ గానుపించినను లోపలఁ జూడ వారిశరీరమంతయు విషమయమై యుండును.పాములకుఁగోరలయందును, తలయందీఁగకును, దేలునకుఁ గొండియందును, దుర్జనులకు నిలువెల్లను విషము కలదని పెద్దలుచెప్పఁగ వినలేదా? మహాత్ములు విద్వాంసులైనను విడువఁదగినవారలు, ఎ

టులనన? పాము మంచిమణిచేఁ బ్రకాసించు చున్నదైనను నది చెడ్డపురుగుకాఁబట్టి దానిని విడుచుచున్నాముకదా. ఈదుర్జనులకుఁ బరమున ఘోరనరకముతప్ప వేఱేదియును లేదు. ఇహమున నపకీర్తియుఁ గలదు.

తుందిలముగా దుష్టకర్మముల నొసరించినవారలు దుఃఖములను బొందఁగలరు. అట్లు పూర్వమందున దుఃఖములను బొందినవారును గలరు. వారిలో నొకనిఁజూపించుచున్నాను.

తొల్లి రావణుఁడను రక్కసుఁడొక్కఁడుకలఁడు. ఈతఁడు మహాపరాక్రమశాలి. ఈతఁడు నిష్కారణముగా నితరులను బాధించు చుండెడివాఁడు. బలహీనులను వేధించియన్యాయముగా రాజ్యమును గ్రహించినవాఁడు. మహాత్ములతపమును బాడు చేసినవాఁడు. తనకు మిక్కిలి దగ్గఱచుట్టమును. నీతివిశారదుండునగుఁ గుబేరుని,దురహంకారముచేఁ దూలనాడినవాఁడు. నాతోసమానుఁడెక్కడ లేఁడని నిక్కుచుండెడివాఁడు. పరదారలను జెఱఁబట్టుచుండెడివాఁడు. మహాపతివ్రతలఁ బాడుఁ జేయఁ బాటుపడుచుండెడివాఁడు. పరద్రవ్యమును బెల్లముతో సమానముగాఁదినఁజూచు చుండెడివాఁడు. వేయేల? ఈరావణాసురునితో సమానుఁడైన దురాత్ముఁడింకొకఁడులేఁడు. ఈరావణాసురుఁడిట్టివాఁడు కాఁబట్టియే నలకూబరునిచేతను, బ్రహ్మచేతను శాపములఁ బొందెను. మఱి మంత్రులను,దనయనుజుఁడునగు విభీషణుఁడు తన్నువిడనాడ

ను. తుదకీదుర్మార్గములవలననే యారావణుఁడు శ్రీరాముల వారిచే మృతిఁజెందవలసివచ్చెను.

చూచితిరా! ఆరావణాసురుఁ డావిధముగా దుర్మార్గకార్యముల నొనరించుటవలననేకదా వాఁడావిధమగుహానిని బొందినది కాఁబట్టివిషవిరాజితమూర్తులైనగర్వాత్ములైన యీదుర్మార్గుల మనము మనదరిఁ జేరనీయఁగూడదు. సంభాషణ సేయఁగూడదు. "దుష్టందూరేచవర్జయే" త్తనఁగాదుర్మార్గునిదూరమునందే విడువవలయుననియర్థము. కాన మనమాకుమతులను దూరమునందెయుంచవలెను. మఱియువారితో నెక్కువ శత్రుత్వముననుండరాదు. మిత్రత్వముతో బొత్తుగానుండరాదు. ఆదుర్జనులతో మనకత్యంతావసరము కలిగినప్పుడు తాత్కాలికస్నేహమాచరింపవలెను. ఎక్కువచెలిమిఁజేయఁగూడదు. చేసినఁదప్పక బాధకలుగఁగలదు. తమలపాకున సున్నమిసుమంత వేసిన బాగుండునుగాని యెక్కువవేసిన నాలుకబొక్కి కీడుగలుగఁజేయదా? కాన నెక్కువస్నేహము పనికిరాదు. ఈకుమతులతో సహవాసముచేసిన యెడల మనముకూడ వారితో సములముకాఁగలము. కుజనసహవాసమువలన దోషములలవడుననియు, సుజనసహవాసమువలన సుగుణములు కలుగుననియు నిదివఱకె చెప్పియుంటినిగదా. అదిగాక సుజనులతోడఁ గలహముపెట్టుకొనుటయైనను మంచిదికాని చెడుగులతోఁ జెలిమిఁజేయుటఁ జేటని మనయాప్తులు నొక్కిచెప్పిరి. అంఁగా దుర్జనమైత్రి యెంతమాత్రము మంచిదికాదని వారి

ముఖ్యాభిప్రాయము. కాన మనము దుర్మార్గగుణములున్న నవి విడిచిపెట్టి సన్మార్గమవలంబించి దుర్మార్గసంసర్గమును విడనాడి సన్మార్గులసహవాసముఁ జేసిజనసుతులమగుచుందము.

క. తగునిదితగదని మొదలో
వగనక సాధులకుఁ బేద•వారల కెగ్గుల్
మొగిఁజేయు దుర్వినీతుల
కగు నని మిత్తాగమంబు•లైన భయంబుల్.

(భారతము.)

# సత్ప్రవర్తనము.

మంచినడవడి కలిగియుండుటయె సత్ప్రవర్తనమనఁబడు.

ఈ సత్యప్రవర్తనగలిగినవారికిఁ బనులన్నియు ననుకూలించును. వీరితరులకు వంద్యులుగాఁగలరు. పరోపకారధురీణులునుగాఁగలరు. ఈ సత్ప్రవర్తకులకున్న సౌఖ్యము లొరులకుండవు. కాబట్టి ప్రతిమనుజుఁడును సత్ప్రవర్తనఁగలిగియుండవలెను.

లోకమునఁ బ్రతివాఁడును, తానుసద్గుణములుకలవాఁడనియు, దాఁజేయుపనులన్నియు సత్కార్యములనియు, దానుసత్ప్రవర్తకుఁడనియుఁ దలఁచుచుండును. కానియిదియసంగతము. ఎట్లన? దొంగ, తానుచేయు దొంగతనము మంచిదనిత

లఁచినపిమ్మటఁగదా వాఁడాచోరత్వమును జేయమొదలిడును. ఇటువొంగతనముఁ జేయుటవానికంగీకారమైనటుల నితరుల కుఁ గూడ సమ్మతముకాఁగలదా? కాదు.అటులనె చెడుగుపను లఁజేయువారికిఁ జెడుగుపనులాదిష్టముండును.కాని సన్మార్గులకి ష్టముండునా? ఉండదు. ఎవ్వరైననుదామ్ముచేయుపని చెడ్డదైనను మంచిదని తలఁచినఁగాని యాపనిని సాధించఁబ్రారంభించరు. కాన లోకమునఁ బ్రతివాఁడును తానుమంచివాఁడని తలఁచుట స్వాభావికముగా గ్రహియింపఁదగియున్నది. అటులైనమన మిఁక సత్ప్రవర్తకులను,దుష్ప్రవర్తకులను దెలిసికొని వారినిఁ దగుపటులగౌరవించుటను గుర్తెఱుఁగవలసియున్నది.

దుర్జనులు, వారిగుణములను శీర్షిక క్రింద దుష్ప్రవర్తకులవిషయముఁ జక్కఁగా దెలియబరచియుంటిని. కాననిఁకసత్ప్రవర్తకులెటువంటివారలో గనుగొందము.

ఈసత్ప్రవర్తకులితరులయందుఁ గారుణ్యము వహించితమకుఁజేతనైనంత వఱకు మేలులఁ గూర్చుచుందురు. వీరలొకరిపై నిష్కారణముగా శత్రుత్వమును బూనరు. సత్కార్యములకంతరాయములను వీరు గలిగించరు. వీరుపక్షపాతాసూయాభావములతో నుండరు. వీరు శాంతమునుదాల్చి యుందురు.వీరలు తమకున్నకలిమితో యోగ్యులకు దానముఁజేయుచుందురు. వీరలు తమవర్ణమునకుఁ దగినధర్మములనె యాచరించుచుండెదరు. వీరలసత్యమాడుట కుంకించరు. జారత్వచోరత్వాద్యసత్కార్యముల యందుఁబ్రవేశించరు. వీరలుసజ్జనులఁ

బీడించువారలను వేధించఁజూచుచుందురు. వీరు గృహకలహములతో నుండరు. సాధుజనులయందును, బేదవారలయందును బ్రీతిగానుండుదురు. భగవంతుని యందును, రాజులయందును, దల్లి,తండ్రి, గురువు మొదలగు శ్రేష్ఠులయందు వినయముగా నుండుదురు. కొందఱని విచారించక వారియోగ్యతనుబట్టి యీసత్ప్రవర్తకులు వారితోఁజక్కఁగా నుండుదురు. వీఁ లె సత్ప్రవర్తకులు,వీరశేషసౌఖ్యముల ననుభవించి యిహలోకమువిడనాడినను వీరిపవిత్ర చారిత్రములు మాత్రము శాశ్వతములై జనులకుసంతోషము కలిగించుచుండును.

ఇట్లు సత్ప్రవర్తనఁ గలిగిప్రసిద్ధిఁ జెందినవారలు మన పూర్వులలోఁ జాలమందికలరు. వారిలో నొకనినిజెప్పెద.

మున్ను దశరథుని కుమారుఁడగు శ్రీరాముఁడు, మంత్రులతోడను, పండితముని బృందముతోడను, నిండి నిబిడీకృతమైయున్న పేరోలగంబునకుఁ బ్రతిదినమువచ్చి జనులయొక్క కష్టసుఖముల విచారించుచుండెడివాఁడు. ఇటులఁగొందఱికాలమైనతరువాత నొకనాఁడీతఁడు తన రాజ్యమునందుండెడి జనులనుబరామర్శించి వారుకష్టములు లేనివారుగాఁనుంట దెలిసికొనిసంతోషింపనెంచి తనయనుజుఁడగులక్ష్మణునిఁబిలిచి"లక్ష్మణా! నీవు మొగసాలలోనికిఁబోయి యెవరయినను నాతోఁదమకష్టవిషయములను జెప్పఁదలఁచుకొని వచ్చినవారలు కలరేమో కనుగొని వారిని నీవెంటఁదీసికొని రమ్మ"నెను. అంతట నాలక్ష్మణుఁడటులఁజేయ బహిర్ద్వారములోని కరిగెను. అత్తఱిని నటఁ దమక

ష్టములఁ జెప్పుకొందమనివచ్చిన జనులు లేరు కాని యొకకుక్క
మాత్రము తన నెత్తి నుండి నెత్తురుఁ గార్చుచు భోరున నేడ్చు
చు వచ్చి యుండెను. దానిని లక్ష్మణుఁడు చూచి "ఏమి; నీతలప
లపగిలిన"దని కారుణ్యముతో నడిగెను. కాని యాభషక మా
తనితో "దిక్కులేనివారికెల్ల దిక్కైన యా రాజచంద్రునితో
నా సంగతిని జెప్పెదను. కాని నీకుఁ జెల్ప"నని వచించెను. అంత
లక్ష్మణుఁడు "మంచిద"ని కొలువులోనున్న తనయన్న సన్నిధిక
రిగి "స్వామీ; మీ యాజ్ఞానుసారముగా వాకిటిలోనికిఁ జనివి
చారించితిని. అచట మా యేలిక వలన మేము సుఖముగా నున్నా
మని వచించు జనులు తప్ప నితరులెవరును గానరారు. కాని యొ
క శ్వానము మాత్ర మేడ్చుచు వాకిట నిలువఁ బడియున్నది. ఏ
మి సంగతియని దానినడిగితిని. కాని యది మీకుఁ దప్ప నితరుల
కుఁ దనసంగతిఁ జెప్పనని చెప్పినది. తరువాత దేవర యాజ్ఞ"య
ని వినయ పూర్వకముగాఁ బల్కెను. అంతనా రాముఁడాతనితో
వెంటనే దానిఁ బ్రవేశపెట్టుమని యనెను. అంతట లక్ష్మణుఁడు
మరల నేగి యా కౌలేయకముతో నిన్నుఁ బిలిచికొని రమ్మని దే
వర యాజ్ఞయైన దని చెప్పెను. అంతట నది "ఏమీ? నన్ను రమ్మ
నెనా? భూదేవతలును, మునులునుండెడి గొప్పసభకు రమ్మని
పిలుచుటేమి చతురత్వము" అని వాక్రుచ్చెను. దానిని విని
యా లక్ష్మణుఁడు తనయన్నకుఁ దెలియఁబఱచెను. అంతనా శ్రీ
రాముఁడు తానె వచ్చి యాకుక్కనుజూచి "ఏమిసంగతి"యని
యడిగెను. అంతనది "రామచంద్రా! నీవు బలిష్ఠులగువారు

లకన్న నుమతనెక్కువగా నాదరించితివి. సతతము నీధ్యాన
ములోనుండెడి వామదేవాది మహర్షులతో సమానముగాఁ బ
క్షికిఁగూడ మోక్ష మొసఁగితివి. నీసోదరుఁడగు భరతునికన్న
బడవలనడుపు గుహునికుశలమును ముందుగా నారసితివి. గొ
ప్పవారలిడువిందుతో సమానముగా శబరిభక్తితో నిచ్చినయెం
గిలిపండ్లను మక్కువతో మెక్కితివి. పితాజ్ఞనుబరిపాలించితివి.
గురునరాదులయందెక్కువ భక్తితోనుంటివి. ధైర్యసాహస
ములతో లోకమునుపీడించు వారినినుక్కడగించితివి. శిష్టులర
క్షించితివి. జనులను ధర్మముగా సుఖముగాఁ బరిపాలించుచుం
టివి. ఆహా! ఏమినీసద్భావము, నీకరుణాళుత్వము, నిన్ను నుతిం
పనేనుశక్తురాలనుకాను. నేఁడు నిన్నుఁజూచుటవలన నేధన్యు
రాలనైతిని దుర్జనశిక్షఁజేయుటకై యీవిధముగా జన్మించితి
వి. కాన నావిన్నపమాలకింపుము. నేనీపురియందుఁ జిరకాలము
నుండియు నితరులకపకారము నొనరించక సంచరించుచుంటిని.
నేఁటిదినమున నొకభిక్షుకుఁడు నన్నుఁ గ్రోధముతో నాశిరము
పగులునట్టులఁ గొట్టెను. కానదయచేసి విచారణఁజేయు"మని
విన్నవించుకొనెను. అంతట రాముఁడు వెంటనేభటులచే నాభి
క్షుకునిఁబిలిపించి "దీనినేలఁగొట్టితి"వని ప్రశ్నించెను. దానికాభి
క్షుకుఁడు "అయ్యా! నేనూరూరనింటింటఁ దిరిగితిరిగియలసి ఇం
టికివచ్చుసమయమున నిదిదారికడ్డముగా నుండి కదలకపోవుట
వలనఁ గొట్టితిని. కాన నీఁక మీయిష్టమువచ్చినట్లు దండించవ
చ్చు"నని యుత్తరమొసఁగెను. తరువాత రాముఁ డానినిసదం

డించనాలోచించుచుండఁగా నీశ్వానము "రామచంద్రా! కా
లాంజనమనెడి పర్వతముననుండెడి దేవాలయమును బాలింపఁ
బంపుము, ఈదండనము చాలు''ననితన యభిప్రాయమునిచ్చె
ను. అంతట రాముఁడటులనొనరించి యాభపక్షమును సంతో
షింపఁజేసెను.

చూచితిరా! ఆశ్రీరాముఁడు మునులయందును, బండి
తులయందును, గొప్పవారలయందునె కాకపక్షులయందు, ను
దుతలయందు,కుక్కలయందును గూడఁదన యవ్యాజప్రేమ
యును, దయాళుత్వమును గనఁబఱచెనుకదా. దానివలననె యి
ప్పటికి మనవారలాశ్రీరాముని సత్ప్రవర్తకుఁడని తలఁచుటయె
కాక పరాత్పరునిగా భావించుచున్నారు. కావునఁ బైనఁ దెలిపిన
విధమున సత్ప్రవర్తన వలన ననేక లాభములు కలుగును. కా
బట్టిమనము సత్ప్రవర్తనఁగలిగి లోకముచే సన్నుతినిఁబొందు
చుండుదము.

క. పలుకఁడసత్యము దూఱం
బలుకఁడు బెట్టిదముఁ గాఁగఁబలుకఁడు వాదం
బులకుఁజొరఁడు వాణియనం
గలవాకిలి యట్టిబుధుఁడుగప్పంజాలున్.

(భారతము.)

# ఆ రో గ్య ము

—:—:—

ఆరోగ్యమన రోగములేకుండ నుండుటయె.

ఇది జంగమముల కత్యవసరము. ఈయారోగ్యమె మనుజుని రంజింపఁజేయుచున్నది. ఇదియె ప్రతికార్యమునకుఁ బ్రోత్సాహకరమైనది. ఇదియెయాముష్మికంబునకుము ఖ్యోపకరణంబు. "శరీరమాద్యంఖలు ధర్మసాధన"మ్మని వినియుండ లేదా? ఇదియె యనర్ఘ ప్రీతికియాకారకంబు, ఇదియే దీర్ఘాయుః ప్రదంబు. ఇట్టియారోగ్యము లేనివాఁడు బ్రతికియుఁ జచ్చినవాఁడే.

అనారోగ్యము, సకలధర్మప్రీతి బంధకంబు. కానఁ బ్రతిమనుజునకుఁ బ్రతిపశువున కారోగ్యంబవసరంబు.

ఈయారోగ్యము కలిగియుండుటకుఁ గతిపయమార్గము లవలంబింపవలెను. ఆమార్గములేవి యనిన? సూర్యోదయాత్పూర్వమె నిద్రనుండి మేల్కాంచుట. దంతధావనాది కృత్యంబుల నిర్వర్తించుకొని ప్రవహించెడి నదిలోఁగాని పరిశుభ్రమగుజలమునఁగాని చక్కగాఁ జలకమాడుట. జాముపైన రెంకు జాములలోగా నిరపాయములగు వ్యంజనములతో నాతిమాత్రముగా, నన్నమును భుజించుట. విమలజలమును నెల్లప్పుడు త్రాగుట. పరిశుద్ధమగు గాలినిఁబీల్చుట. చిరుతిండిఁదినకుండ నుండుట, తనదార్ఢ్యమునకుఁ దగినట్టుగా వ్యాయామంబొన

ట. కోపము, మనోవ్యాకులత లోనగువానిని చేర్చకుండనుండుట. మత్తుపదార్థములను బుచ్చుకొనకుండ నుండుట. మలమూత్రాదుల నడ్డగించకుండుట. దుర్వ్యాపారములు లేకయుండుట. మితసంభోగము కలిగియుండుట. రాత్రియందుజామునకులోఁగా భోజనముచేయుట. దినమున నాలుగంటలు మాత్రము మంచిగాలివచ్చు కిటికీలను దెఱచి నిర్మలమగు గృహమున శయనించుట లోనగునవి.

ఈమార్గమునను మనము నియమముగా సంచరించవలెను. అటులచేసిన మనమారోగ్యభాగ్యమును బొందఁగలము. ఇటఁబైఁజెప్పిన మార్గముల నవలంబింపక పోతిమేని మనము రోగులము కాఁగలము. ఆరోగములను రూపుమాపుట కౌషధములున్నవికాని యామార్గములకు భిన్నముగానడచి రోగులమేలకావలయును? "అడుసుఁద్రొక్కనేల, కాలుఁగడుగనేల."

కాఁబట్టి యీయారోగ్య మార్గమున నె నడచిబలవంతులమగుదము. ఇటుల నారోగ్యమార్గమున నడచినను దైవవశమున నప్పుడప్పుడు కొన్నిరోగములు వచ్చుచుండును. వానికిఁదగిన చికిత్సలను మనవారింతకుఁ బూర్వమె యేర్పాటు చేసిరి.

ఆయారోగ్య విషయిక చికిత్సలు గలదాని నాయుర్వేదమనియెదరు. ఈయాయుర్వేదమును దొలుతఁగమలాసనుండు దక్షప్రజాపతికిని, దక్షప్రజాపతి, సూర్యపుత్రులగు నశ్వినీదేవతలకును, వీరు సహస్రాక్షునకును, ఈయన యాత్రేయాదిము

హాస్త్రులకుపదేశించెను. పిమ్మట నీయాయుర్వేదము ధన్వంతరి, శుశ్రుత, అగ్నివేశ, చరకాదిపారంపర్యగా నుపదేశింపఁబడుచు వృద్ధి చేయఁబడుచుండెను,

ఈప్రైఁజెప్పినవారలందఱు వైద్యగ్రంధములను రచించి లోకోపకారకులైరి. ఈగ్రంధములలో మిక్కిలిఁయన్నికెక్కినవి చరక శుశ్రుత మహామునులవలన రచింపఁబడిన చరకసంహిత శుశ్రుతసంహితయను గ్రంథములుమాత్రమే. అందును మొదటిది చరకసంహిత. ఇది 8 భాగములుకలదై యున్నది.ఇయ్యది కాయ చికిత్సలఁజక్కఁగాఁ దెలియఁబరచును. ఈ విషయమునఁదిది యె యుత్తమము. రెండవదియగు శుశ్రుతసంహితయు 8 భాగములుకలదై యున్నది. ఇది శస్త్రచికిత్సలంగుఱించిమిక్కిలి చక్కఁగాఁ దెలియఁబరచుటయందుఁబేరెక్కియున్నది. శస్త్రచికిత్సల (సర్జరి) విషయమై తెలియఁబఱచుటయం దుత్తమోత్తమిదియె. ఇటులనిప్పటిపాశ్చాత్త్యులు కూడ గొనియాడియున్నారు. మఱియు వారు మనగ్రంధములలో వచించిన వైద్యమునుగొంతవఱకుఁ జేయుచున్నారని చెప్పవచ్చు. అరేబియావారు మనయార్యులేర్పఱ్చిన యాయుర్వేదమార్గముననుసరించియుఁ గొన్నిగ్రంధములభాషాంతరీకరణముఁ జేసికొనియు "యూనాని" యనుపేరనౌషధములవాడుచున్నారు. ఇటులనె మనయాయుర్వేదమును నమస్వజనులు గొనియాడియున్నారు. కానమనము మనయాయుర్వేదమతరీతిగానె ప్రవర్తించి యారోగ్యవంతులమగుదము.

ఆరోగ్యముతో సమానమైన భాగ్యమింకొకటిలేదు. మనమారోగ్యముగానుండుటకుఁ గొన్ని మార్గములిదివఱకె చెప్పఁబడియున్నవి. వానినన్నిటిని మనమాచరించుచుండవలయు. "రాజున్నదిరాకమానదు. కానున్నదికాకమాన"దని యారోగ్యవిషయమున విచారించఁగూడదు. అనేకభంగులనారోగ్యముగానుండవలెను. ఆరోగ్యమార్గములకు మనము వ్యతిరేకముగా నడచితిమేనిఁ దప్పక కీడుఁబొందఁగలము.

అట్లారోగ్యమార్గములకు భిన్నముగానడచి కీడుఁబొందినవారిలలో నొకనిని జూపించుచున్నాను.

మున్ను విచిత్రవీర్యుఁడనువాఁడు శంతన మహారాజునకు రెండవకుమారుఁడై నెగడుచుండెడివాఁడు. ఇతఁడుతనయన్నయగుభీష్మాచార్యులసహాయమునఁ గాశీరాజదుహితలగు నంబికాంబాలికలను నిరుపమప్రాబోఁదులను వివాహమాడెను. ఆ నెలఁతలయందు మిక్కిలిమక్కువగా నుండెడివాఁడు. ఆలలనలిద్దరు తనతోడఁగాపురముఁజేయ మొదలిడిన తోడనె యఖండంబగు రాజ్యంబునందలి విశేషంబులవిచారించుట మానివైచెను. జనులసుఖదుఃఖములఁగాంచకుండెను. వేయేల? సర్వవ్యాపారముల విడనాడి యెల్లప్పుడు సుందరాంగులతో మనోభిరామంబులగు మిద్దెలయందును, చిలుకలు, కోకిలలు, నెమిళులగు వానియొక్క సుస్వరములతో నిండుకొనియుండెడి మందిరతోటలయందును. మఱియు మంచిచోటులయందును విహరించుచుండెడివాఁడు. ఈవిధముగా నితరవ్యాపారములవిడనాడి యా

యంగనలతో నెల్లప్పుడు రమించుటవలనఁ గ్రమక్రమముగా కృశించి చిన్నతనములోనె క్షయవ్యాధి బాధితుఁడై యమపురికిఁ జనెను.

కంటిరా! అవిచిత్రవీర్యుఁడారోగ్యవిధ్వంసకమగునమితరతివలనఁగాదె యటులఁ జిన్నతనములో నేమృతిఁ జెందినది. కాబట్టి యెవ్వరైన నిదివఱకుఁ దెల్పఁబడిన యారోగ్యమార్గములను సంచరించిన సుఖభాగులగుదురు. కావున మనమారోగ్యమార్గములను సంచరించుచు సుఖులమైపూర్ణాయుష్యము కలిగిన వారమైయుండుటకుఁ బ్రయత్నింతము. మనయాయుర్వేదయౌషధములనె వాడుచుందము. మఱియు నేవిధమునైనయారోగ్యముగానుందుదము.

క. యోగ్యులు బల్కుదు రెప్పుడు
నారోగ్యము భాగ్యమె యటంచు నధిక నీరా
రోగ్య విహీనులౌ వారలు
సౌభాగ్యాదుల దూరులౌచుఁ బోదురు సఖుఁడా!

# సంస్కృతభాష

వ్యాకరణాదులచేఁ జక్కఁగా సంస్కరింపఁబడిన భాష సంస్కృతభాష యనఁబడు. భాష యన జనులు పరస్పరము తమతమ మనోభావముల నెఱిఁగించుకొనుట యె.

ఈజగమునందు భాషలన్నిటికి నిదియె మూలము. అనఁగా నేభాషయైనను దీనిననుసరించియె యుండును. కాబట్టియె లోకజ్ఞానులీభాష కాదిభాషయని పేరిడిరి. ఈయాదిభాష, ప్రాకృతము, సంస్కృతమను నామధేయములతో రెండువిధములై యొప్పారు చుండును.

ప్రాకృతమన సరస్వతీదేవి బాల్యమునఁదొట్రుపాటుగ మాటలాడినది. ఇదియాఱువిధములై యుండును దీనిని నాటకాదులయందునీచపాత్రములకుపయోగించు చుండును. ఈప్రాకృతమునకుఁ దగినవ్యాకరణశాస్త్రమును వాల్మీకి మహర్షిరచించెను.

ఇఁక సంస్కృతమన సలక్షణముగా లక్షణగ్రంథములచే సంస్కరింపఁబడినదని యిదివఱకె చెప్పితినిగదా. ఇది సర్వజనులకుపయోగించును. ప్రాకృతమంతగా నుపయోగములో లేదు. కాన దానినివిడిచి యుపయోగమెక్కువగాఁగలిగిన సంస్కృతవిషయమై మహర్షీతరులగు ప్రకృతము ప్రసిద్ధిబొంది యున్నగ్రంథనిర్మాతలను గొందఱినిమాత్రము గైకొని సంగ్రహముగాఁ దెలిసికొందము.

మన మత నీతి జ్ఞాన చారిత్రముల కాటపట్టగు వేదము లపౌరుషేయములై సుస్వరయుక్తములై యీసంస్కృతభాష యందె ప్రకాశమానము లగుచున్నవి. ఈవేదములు శ్లోకరూపములుగా నుండవు. ఇవి హిందువులకుఁ బ్రబలప్రమాణములును, బూజ్యములు నగుచున్నవి.

వాల్మీకి ఈవైదిక భాష నక్కడక్కడననుకరించుచుఁ జాతురిగా లౌకిక భాషను జొన్పుచు నీగీర్వాణమందునఁ గొ్రత్తగాఁబద్య కవనంబుఁబన్ని భగవదవతారముగు శ్రీరాముని సచ్చారిత్రమును రామాయణమను పేరిట సరసముగా రచించిసంస్కృతంబునఁ బద్యకవనంబునఁ దామార్గదర్శియని జనికరముచేఁ గొనియాడఁబడెను.

ఇతనితరువాత వేదములు సంగ్రహముగాఁ దెలిపినమతనీతిజ్ఞాన రాజకీయ విషయముల వివరించుచు శాసనములుగా ధర్మశాస్త్రములను, మనుపరాశరాది మహానుభావులేర్పాటు చేసి లోకోపకారధురీణులై ప్రసిద్ధికెక్కిరి. ఈస్మృతులలోనికి నుత్తమము మనుస్మృతియె. కాని యీకలియుగంబునఁ బరాశరస్మృతియె జనులకుఁబ్రమాణమని వివేకధురీణులు చెప్పిరి. కాఁబట్టి మనకుఁ బ్రమాణగ్రంధము పరాశరస్మృతియె. ప్రస్తుతము మనలనుబాలించు నీహూణప్రభువులును, మనువుచే రచింపఁబడిన మనుస్మృతిని, నింకనితరమహర్షులచే రచింపఁబడిన స్మృతులను, దమయాంగ్లేయభాషలోనికి భాషాంతరీకరణముఁజేసికొని "ఇండియన్ పినల్ కోడ్"అను మొదలగు పేరులఁబెట్టి(లాబుక్సు) శిక్షాస్మృతులనేర్పాటుఁ జేసిరి. వేదముల తరువాత మనుస్మృతిమొదలగు ధర్మశాస్త్రము లన్నియు హిందువులకుఁ బరమప్రమాణము లనియు, నందలిధర్మముల నాచరణీయములనియుఁ దెలిసికొనవలయును.

వీరి తరువాతఁ బరాశర పుత్రుండగు వ్యాసుండష్టాదశ పురాణములను, సకలధర్మాదర్శంబును బంచమవేదంబును నగుభారతంబును రచియించి నిలింపభాషయందున రెండవకవి యని ప్రఖ్యాతిఁగాంచెను. ఈపురాణము లనేక చరిత్రలభిజ్ఞులకు మనోజ్ఞములై యొప్పుచుండును. వీనియందు ధర్మములు వివరముగాఁ జెప్పఁబడును. కావున నివియును హిందువులకు గౌరవార్హములు.

ఇంతవఱకు లక్షణగ్రంథములు లేకపోయినను బైవారాది కవియగువాల్మీకి మహర్షి ననుసరించి వ్రాసిరి. క్రీస్తు పుట్టుటకుఁబూర్వము 12వ శతాబ్దమందున్న పాణినిమహర్షి యీశ్వరానుగ్రహముచేఁ బదునాలుగు సూత్రములఁబొంది వానికిఁ దానునాలుగువేల సూత్రముల నైపుణిగా రచించి "యష్టాధ్యాయి" యను పేర నొకగ్రంథమును బ్రకటించెను.

తదుపరి వరరుచియను మహానుభావుఁ డాపాణిని మహర్షి చేసిన నాలుగువేల సూత్రము లీసంస్కృతభాషను సంస్కరింపఁజాలకపోవుటఁగాంచి తాను వార్తికములను గొన్ని రచించి భాషోద్ధారకుఁడై లోకభూషితుఁ డాయెను.

ఇతని తరువాత క్రీస్తుశకమునకుఁ బూర్వము 2వ శతాబ్దమందున్న పతంజలియను మహాముని యాపాణిని మహర్షి రచించిన నాలుగువేలసూత్రములను, వరరుచిప్రణీత వార్తికములను, గైకొని వానికి భాష్యమొనరించి లోకకృతజ్ఞతా పాత్రుఁడయ్యెను.

సూత్రకారుఁడగు పాణినిమహర్షియు, వార్తికకారుఁడగు వరరుచియు, భాష్యకారుఁడగు పతంజలియు వీరుముగ్గురు చేరి లక్షణగ్రంథ మొకదానిని రచించి సంస్కృతమును నియమబద్ధముగా నొనరించిరి. ఈముగ్గురును జేరి లక్షణగ్రంథ మేర్పఱచిరికాన వీరికి మునిత్రయమని పేరువచ్చినది. అన్ని బాసలకు మూలమగు నీయాదిభాషకు సరసముగా వ్యాకరణాబానర్చిన నీమహనీయులయొక్క పాండితీవైదగ్ధ్యమెంతగొనియాడినను దక్కువయొకదా.

మఱియుఁ గాత్యాయనుఁడను నొకమహర్షి కూడఁగొన్ని సూత్రముల రచించి భాష కుపకార మొనరించి వాసిఁగాంచెను.

మహాశయులగు నీనలువుర సూత్రభాష్యముల ననుసరించిపండిత ప్రకాండులు కొందఱు వృత్తులను రచించిరి. ఈవృత్తులకు మఱికొందఱు సుధీవరులు వ్యాఖ్యానముల నొనరించిరి. మహర్షికృతసూత్ర వార్తికభాష్యములకు వృత్తులరచించినవారియందును, వృత్తులకు వ్యాఖ్యానముల నొనరించిన వారియందును భట్టోజిదీక్షితుఁడు కడుప్రసిద్ధుఁడై యున్నవాఁడు. ఈయన పాండిత్యాతిశయ మనిర్వచనీయము. ఈతని గ్రంథబోధకతాశక్తి నిరుపమానము. ఈమహానుభావుని నామునిత్రయముతో సమానునిగా లెక్కించవచ్చును. ఈతఁడు రచించినసిద్ధాంత కౌముదియనునది సుబోధకమై నుతిపాత్రమగుచుండును.

అద్వైతమతావలంబుఁడును, సారస్వత బ్రాహ్మణుఁడునునగు శ్రీకాళిదాసు క్రీస్తుపుట్టుటకుఁ బూర్వము ౫౬వ సం

వత్సరమునందున్నవాఁడు. ఈకవి, రఘువంశ కుమారసంభవ, మేఘసందేశ, ఋతుసంహారములను కావ్యములను, శాకుంతల,విక్రమోర్వశీయ, మాళవికాగ్నిమిత్రములను నాటకములను మనోభిరామముగా రచించి రాజాదరణాంబుగలిగి లోకప్రసిద్ధుఁ డయ్యెను. ఈమహాకవి గొప్పగొప్ప పండితులచే మెచ్చుకొనఁబడినవాఁడు. ఈకవి రచించిననాటకములు, కావ్యములు, నవరసమిశ్రములై క్రమతమములై పాఠకులకు లోకజ్ఞానోపేతాభిరుచిఁ గలిగించుచుండును. ఈకవి యుపమాలంకారముల నుప్రయోగించుటయందుఁ గడుచతురిమ కలవాఁడు. ఇతఁడు చేసినగ్రంధములు, పైనఁదెలిపినవె కాక యింకనున్నవని కొందఱు చెప్పుదురు. కవులలోనికి నితఁడెయుత్తముఁడని చెప్పనొప్పు.

ఇతని తరువాతబ్రాహ్మణోత్తముండగు దత్తకునిఁ బుత్త్రుఁడగు మాఘమహాకవి శిశుపాలవధమహాకావ్యంబునురచించి దిగ్దిశకంబున సద్యశమును సంపాదించెను. ఈశిశుపాలవధమహాకావ్యము 20 సర్గలుకలది. ఈకావ్యమందున భాగవత కథకలదు. ఈతనికవిత్వమతిపటువై నానాలంకారశోభితమై శ్రవణానందముఁ జేయుచుండును. ఈకావ్యమందున 9 సర్గలు చక్కఁగాఁ బఠించినవారికి సమస్తశబ్దములు తెలిసియుండునను టయె. కావ్యములన్నిఁటిలో నీకావ్యమె మిన్నయని యెన్నిరి.

ఇతని తరువాత శిష్టాచారకర్మరతుఁడును,శ్రీకంఠపదాంకితుఁడును, పదవాక్యప్రమాణజ్ఞుండును, నగుభవభూతి మహాణ

భాషించు చుందురు. ఇట్టియనర్ఘమగు నాదిభాషను మనమె క్కువగా నభివృద్ధిఁజేయ వలయును. సంస్కృతపండితులను స న్మానించుచుండవలెను.అటులఁజేసిన మనముగూడ నభివృద్ధికి రాఁగలము. మనకీర్తియుఁగూడ నాచంద్రార్కముగా నుం డఁగలదు.

అమూల్యంబగు నీగీర్వాణంబును వృద్ధిఁజేసితాము విద్వాంసులై విద్యావంతుల గౌరవించి శాశ్వతంబగు సద్యశ మార్జించినవారు పూర్వులలోఁగలరు.వారిలోనిద్దఱిని జూపిం చు చున్నాను.

విక్రమార్క మహారాజు పరోపకారకుఁడై విద్వాం సుఁడై విచక్షణదక్షుఁడై సంస్కృతమాహాత్మ్యంబెఱింగి దా నిని వృద్ధిం జేయందలంచి ధన్వంతర్యాదినవకవీశ్వరులను దన యొక్క యాస్థానమందునిచికొని వారినిఁబోషణఁ జేయుచు విశేషసన్మాన మొనరించుచు వారిచే సరసగ్రంధములను ర చింపఁజేసి యాగ్రంధములకుఁ దగినటుల బహూకరించి ధీవ రులనామోద సాగరమగ్నులనుగాఁజేసి యితరులకుఁబ్రోత్సా హమొనరించుచు ననేకశతంగుల నీయాదిభాష నభివృద్ధిఁ జేసి శాశ్వతకీర్తి గడించెను.

అట్లనె భోజమహారాజును తనయొక్క యాస్థానమందు గొప్పపండితుల నుంచుకొని వారినిబోషించుచు సంస్కృతం బునఁ గవిత్వముఁజెప్పువాఁడు నాచే బహుమానముఁ బడ యుఁగలఁడని ప్రకటించి యావిధముననె తనదగ్గఱకు దూర

దేశములనుండి పండితులువచ్చి సరసకవనంబుసెప్పిన వారివి మెచ్చుకొని విశేషముగా గౌరవించి ధనమిచ్చి నిజరాజధాని యగు ధారానగరమునందె వారిని నివాసముగలవారినిగా నొనరించుచుండెడివాఁడు. ఇట్టిరాజు చేయుటవలనఁ గడజాతి వాఁడును సంస్కృతభాషను గవనముఁజెప్పఁ గలవాఁడయ్యె ను.ఆనమయమున నీదేవభాష దేశభాషగా నూతినదని చె ప్పవచ్చు. ఈవిధముగాఁ దనరాజ్యమంతయు నుండుట వలన మనమున నానందమందుచుండెను. తాను విద్యావంతుఁడ గుటవలన సరస్వతీకంఠాభరణమను గొప్పయలంకారగ్రంధ మును,రామాయణచంపువును రచించి గీర్వాణము నభివృద్ధిఁ జేయుచు లోకసంస్తవనీయుఁ డాయెను.

చూచితిరా? ఆవిక్రమార్క మహారాజు ధన్వంత ర్యాది కవీశ్వరులను గౌరవించుటవలననె కదా లోకోపకార కారకగ్రంథములుబయలు వెడలినవి.అవివెడలుటవలననెకదా యామహారాజుకీర్తి దిగంతముల వ్యాపించఁగలిగెను. మఱి యు భోజమహారాజు పండితులగౌరవించి వారిచేగ్రంథముల రచింపఁజేయుటయె కాక తానొకగొప్పయలంకార గ్రంథ మును, స్వాద్యపద్యగద్య చంపువును రచించుటవలననె కదా యామహారాజు నిప్పటికి జనులు కీర్తించుచున్నారు. కాఁబట్టి మనము సదసద్విమర్శనసాధన భూతంబును, యోగవేదాంత వైద్యవిద్యాద్యంబును, నగుసంస్కృతసాహిత్యమందుసా హిత్యమును సంపాదించి పండితప్రకాండుల సత్కరించుచు న

శకము 730 వ ప్రాంతమునఁ గలఁడు. ఈతఁడు మహాకవియై మాలతీమాధవము, మహావీరచరితము, ఉత్తరరామచరితము లను మూడు నాటకములను రచించెను. అందున నుత్తరరామ చరితము కడుసొగసని కోవిదు లనెదరు. ఈమహాకవి రచించిన నాటకములన్నియు నీతియుతములై శ్రోత్రపేయములై తన రారుచుండును.

ఇతనితరువాత మురారియను మహాకవి యనర్ఘరాఘవమను పేరిట నొకనాటకమును రచించెను. ఈనాటకము, శబ్దశాస్త్రనిపుణులకును, నిఘంట్వాది పరిశోధకులకును, గ్రాహ్యమగునదిగానుండి శ్రీరామచరితోపేతమై నయయుతమై చదువరుల కింపునింపుచుండును.

ఇతని తరువాత బహుకాలమునకు మల్లినాథుఁడను మహాపండితుఁడు కోలచలవంశమునందు జనించిచతుష్షష్టి కలావిశారదుఁడై పంచకావ్యంబులకును, శ్రీహర్షకృతనైషధ మహాకావ్యంబునకును, మఱియుఁగొన్ని నాటకములకుఁ గించి ద్జ్ఞబోధకంబగు సులభశైలిని వ్యాఖ్యానముల రచించి కవిభావములఁ జక్కఁగాఁ దెలియఁ బఱచుచు "మహామహోపాధ్యాయ" బిరుదమును విద్వాంసులచేఁగొని సంస్కృతవాఙ్మయ విమర్శకుల కెల్ల వందనీయుఁడై వన్నె కెక్కెను.

హూణశకము 1550 వ సంవత్సరమున విశ్వజిద్యాజి యగు రంగరాజ మఖి కప్పయ్యదీక్షితుఁడను సుధీవరుఁడుద్భవమంది దురాచారముల నాశన మొనరించుచు నద్వైతమత

రతుఁడై శివభక్తశిఖామణియై నిరుపమాన పాండితుఁడై వివిధ శతగ్రంథములను రచించి ప్రఖ్యాతికెక్కెను. అందునఁ గొన్నికబ్బముల పేరుల నుదాహరించెదను. శివకర్ణామృతము, బ్రహ్మతర్కస్తవము, వరదరాజస్తవము, సిద్ధాంతలేశసంగ్రహము, విధిరసాయనసుఖోపజీవిని, న్యాయరక్షామణి, భారత తాత్పర్యసంగ్రహము.శబ్దపరిశోధము,చిత్రమీమాంస, కువలయానందము, రసికజనరంజని, మొదలగునవి.ఆగ్రంథన మూహమున నందుకువలయానందము ప్రస్తుతము క్కువగా నాలంకారికులకుపకార మొనర్చుచున్నది.రసికజనరంజని దీని టీకయని తెలిసి కొనుఁడు.

ఇంకను నీసంస్కృతంబునఁ గవులనేకులు సుప్రసిద్ధులు కలరు. వారురచించిన గ్రంథసముదాయమును గలదు. కాని గ్రంథవిస్తరభీతిచే వానిని విడిచిపెట్టితిని.

ఈసంస్కృతమున షట్ఛాస్త్రములును గలవు. ఈసంస్కృతగ్రంథముల వలననే మనపూర్వులాకాశవిమానముల ను,నణిమాద్యష్టాంగ సిద్ధులను, దూరదృష్టి మొదలగు వానిని గనిపెట్టిరి.మఱియుఁ బరకాయ ప్రవేశాదుల నొనరించిరి.వే యేల ? సమస్తకార్యము లీసంస్కృతగ్రంథసముదాయము వలననె నెఱవేర్చుచుండిరి. భూగోళఖగోళ విషయముల విశదీకరిందునది యిదియె.జగమునంతో వ్యాపించియుండునదియు నిదియె. ఇదియె. మనకాధారము. ఈయాంధ్రభాషయందుం తర భాషలకన్నిఁటికి మూలము.ఈభాషనె దేవతలుమాడెడి సం

వారాజుతో "వల్లె" యని యింటికిఁజనెను. అటుపిమ్మటఁ
దనకిష్టుఁడును, సతీర్థుఁడును, సంస్కృతద్రావిడ కర్ణాటభాషా
పండితుఁడునగు నారాయణభట్టుచే నాంధ్రభాషకు సం
బంధముకలిగిన కన్నడమునం దక్కడక్కడ ఛందోవిషయ
మున సాహాయ్యమందుచు నదివఱకుఁ గక్కిఱిబిక్కిఱిగానున్న
యాంధ్రమును సంస్కరించుచుఁ బద్య గద్య యుక్తముగా
నూతనముగా నారాజనరేంద్రునిఁ గృతిపతినిఁజేసి వ్యాస
రచితభారత మాంధ్రీకరించ మొదలిడెను.క్రమముగానాతఁ
డాభారతము నందాదిసభారణ్యపర్వములను రచించెను. అం
తటనానన్నయభట్టు తనయభీష్టమును దుదివఱకుఁ గొన
సాఁగనీయని దైవమువశమున విధివశుఁ డాయెను. ఈతనికవ
నము, రెండువంతులు సాంస్కృతికపదములను, నొకవంతు
తెలుఁగుపదములును,కలిగి బహుసరసముగానసేకాలంకారశో
భితమై దూరాన్వయములులేక యొప్పుచుండును.మన తెలుఁ
గుబాసలోనీతఁడె మొదటికవి.ఈనన్నయభట్టాదికవికాఁ
డని కొందఱనెదరు.కాని ఈతనికిఁబూర్వమున నొకపుస్తకమై
న నాంధ్రభాషయందుఁ గనుపడకపోవుటవలన వారుచెప్పునది విశ్వసనీయముకాదు.ఇప్పుడిప్పుడుకొన్నిపాత్రముల బయలుదేఱఁ
దీసి యవి నన్నయకుఁబూర్వములె యని వాదుచున్నారు.కాని
యీపాత్రములన్నియు నారయ నిటీవలివె యగుచున్నవి.కాన
నన్నయ యాదికవియని చెప్పనొప్పు. ఈయాంధ్రకవితా
పితి, యాంధ్రశబ్దచింతామణియను లక్షణగ్రంథమొకదాని

ని రచించెనని కొందఱు ధీవరులనెదరు. కాని యది చింత్యము. ఈ మహాకవి బుద్ధియందు బృహస్పతితో సమానుఁడు. నిగర్వి, పరోపకారి, కృతజ్ఞుఁడునై యున్నవాఁడు. ఈకవి యాంధ్రమును సలక్షణముగా నొనరించుటవలన విద్వాంసులచే "వాగను శాసనుఁ"డని బిరుదమునందెను. కొందఱీతనిని నియోగియనెదరు. కాని వైదికుఁడని తెలిసికొనుఁడు.

ఈకవికిఁ దరువాత హూణశకము 12వ శతాబ్దమందునఁ దిక్కనయను మహాకవి కొమ్మనపుత్త్రుఁడై యుభయకవిమిత్త్రుఁడై నియోగిశిఖామణియై ప్రసిద్ధినిగాంచుచుండెను. అంతనొకసమయమున నదివఱకు నన్నయచేఁ గొంతవఱకు రచింపఁబడి మూలఁబడియున్న భారతమును గాంచెను. అంతట నాభారతమును బూరితిఁ జేయవలయునని తనకు బుద్ధిపొడమెను. అటుతరువాత హరిహరనాథునిఁ గృతినేతగా నొనరించి విరాటపర్వాది పంచదశపర్వములను, బహుశ్రద్ధతో సరసముగా నాంధ్రీకరించి దానినిఁ బూర్తిఁ జేసెను. ఈకవి, యీభారతమును బూరితిఁ జేయకమున్నె మనుమ భూపాలునిఁ గృతినాయకునిగా నొనరించి నిర్వచనోత్తర రామాయణమును రచించెను. మఱియుఁ గవివాగ్బంధమను గ్రంథమును రచించెను. ఈతని కవిత్వము మూడుపాళ్ళు తెలుఁగుపదములును, నొకపాలు సంస్కృతపదములును కలిగి ద్రాక్షాపాకమై దీర్ఘసమాసములు లేనిదై నానాలంకారశోభితమైనరసమై మనోజ్ఞముగా నుండును. ఎట్టిపట్టుల నెట్టిపదములఁ బెట్టి యారసముట్టిపడునటులఁ జేయవలయునో యావి

ద్గ్రంథముల రచించి సద్యశమార్జించుట కెక్కువగాఁ బ్రియ త్నింతము.

ఆ. వె. ఎల్లభాషలకును దల్లి యిల్ల యనఁగ
సంస్కృతంబు మనము చదువవలయుఁ
జదివి దానిమహిమఁ జాటించవలయును
జాటి దాని వృద్ధి సలుపవలయు.

---

# ఆంధ్రభాష.

మన తెలుఁగు బాస నెయాంధ్రభాషనియ నెదరు.

మన తెలుఁగు బాసకీయాంధ్రసంజ్ఞ యెటులఁ గలిగినదన- మగధదేశమును బరిపాలించు, ఆంధ్రనామక ప్రభువు మనపూర్వులు నివశించుదేశమును జయించి పరిపాలించుటంబట్టి మనదేశమునకును, మనబాసకు నాంధ్రసంజ్ఞ కలిగినది. అప్పటినుండి యిప్పటివరకు మనదేశమాంధ్రదేశమనియు, మనబాసనాంధ్రభాషయనియు వ్యవహరించుచున్నారు.

ఈభాష స్వతంత్రభాష కాదు. ఈభాష సంస్కృతము, ప్రాకృతము, ద్రావిడము, కర్నాటమను నాలుగుబాసలతోఁ గూడికొనియున్నది. సంస్కృత ప్రాకృతభవపదములు తప్ప ద్రావిడ కర్ణాటపదములన్నిఁటిని దేశ్యములని మనవారు వాడుచున్నారు. మనదేశమునకు వేగియను నామాంతరము క

లముగాని భాషకుఁగావరాదు. మనదేశమునందు మొదట కొంతకాలమువరకు సంస్కృతద్రావిడకర్ణాటభాషలు మిక్కిలి ప్రచారము కలవియై యున్నవి. ఆభాషలయందున లెక్కలేని కబ్బములు బయలువెడలినవి. గొప్పగొప్ప పండితులున్నారు. కాని మన తెలుఁగుబాస మిక్కిలి ప్రచారములేకపోవుటయకాక దానియందొక శాస్త్రమైనను బయలువెడలక నియమరహితమై సంకరభాషయై యుండెను. దానినె జనులు మాటలాడుకొనుచుండిరి.

ఇట్టితరుణమున నాపస్తంబసూత్రుఁడును, ముద్గలగోత్రజాతుఁడును, వైదికశిఖామణియునగు నన్నయభట్టు జనించి యదివఱకభివృద్ధిదశలోనున్న సంస్కృత పంచకావ్యంబులను, నాటకంబులను, వ్యాకరణశాస్త్రంబును, ఛందశ్శాస్త్రంబును జక్కఁగాఁబఠించి పిమ్మట ద్రావిడభాషను బ్రాకృతభాషను బాగుగాఁజదివి విద్వాంసుఁడై లోకజ్ఞానములవరించుకొనుచు వెగడుచుండెను. ఇటుల వెగడుచుండు నన్నయభట్టును 111-సంవత్సరమున రాజ్యముసుఖముగాఁబరిపాలించు రాజరాజనరేంద్రుఁడు తనయాస్థానమునకుఁ బిలిపించుకొని సగౌరవముగానిటులఁబల్కెను. "పండితవరా! నేనుభారతంబును వినుటకెక్కువయిష్టపడుచున్నాను. కాన నీవు సంస్కృతమునందుండు భారతమును సలక్షణముగా నాంధ్రీకరించి నన్నుఁ గృతార్థుఁ జేయు"మని ప్రార్థించెను. అంతనన్నయభట్టు తానదివఱకె సంస్కృత ద్రావిడకర్ణాటభాషాపండితుఁడై నందువలన నామ

షయమీమహాకవికిఁ దెలిసిన ట్లింకొకరికిఁ దెలియదు. కాఁబట్టియే యీకవి మహాపండితులచేఁ గవి బ్రహ్మయని గౌరవలాంఛనము నందఁగలిగెను. ఈకవి నియోగియైనను వేదాధ్యయనసంపన్నుండయి యజ్ఞమొనరించిన వాఁడు. ఈకవి,సమకాలికుఁడగు కేతనచే దశకుమారచరితమునుగృతినందెను. ఈమహాకవివలన భారతము సంపూర్ణముగ నాంధ్రీకృతమయ్యెను. కాని కొలఁదికాలమైన తరువాత నాదికవిచేరచింపఁబడిన భారతారణ్య పర్వమునఁ గొంతశిథిలమైపోయినది.అందువలనఁబూర్తి కాలేదు.

ఈతిక్కనకుఁ దరువాత హూ॥ శ॥ 14వ శతాబ్దమందున 'నెఱ్ఱాప్రగ్గడ' యను మహాకవి శిథిలమైన యాయరణ్యపర్వశేషమును నన్నయకృతముగానె పూర్తిఁజేసెను. ఈకవి నియోగి, ఈతనితల్లి పోతమ్మ,తండ్రిసూరన్న,ఈతనిది శ్రీవత్సనగోత్రము, ఇతఁడు సంస్కృతాంధ్ర పండితుఁడు. ఈతని కవిత్వము నన్నయతిక్కనల కవనమువలెనుండును. ఈతఁడు శివభక్తుఁడగుటవలన శంభుదాసుఁడనియుఁ, బ్రబంధశైలిని భారతమున నరణ్యపర్వశేషమును బూర్తిఁజేసెను.కానఁబ్రబంధపరమేశ్వరుఁడనియు నామాంతరములు కలవాఁడు. ఈకవి, హరివంశము, రామా[illegible], నృసింహపురాణమును నాంధ్రీకరించెను. ఈము[illegible]సింహపురాణ మహోబలస్వామికంకితముసేసియున్నవాఁడు.శ్రీమదాంధ్రభారతమీపైమువ్వురు రచించుటంబట్టి వీరికిఁగవిత్రియమని పేరిడిరి.వీరి

యాంధ్రీకరణము. "మక్కికిమక్కి" గాలేదు. కాని చక్కఁగా సంస్కృతభారతాను సారముగానున్నది. మనకీముప్వురును యాంధ్రభాషయందుఁ బ్రబలప్రామాణికులు. వీరి ప్రయోగము లె మనకు శరణ్యములు. మన తెలుఁగు బాసలోనికి భారతమె మొదటి పొత్తము. ఈభారతముతో సమానమగుగ్రంథ మింతవఱకును బుట్టలేదు. సద్గుణనికరోపేతంబగు నీకవిత్రయంబును, సులక్షణలక్షితంబగు నీభారతంబును, నటులుంచి యీయాంధ్రభాషయందున నుండుముఖ్యకవులను గైకొని యింకను దెలుఁగును గుఱించి తెలిసి కొందము.

ఈపదునాలుగవ శతాబ్దమందె హుళక్కిభాస్కరమహాకవియుండెను. అతఁడు వాల్మీకి కృతరామాయణమును దెనిఁగించెను. ఈతఁడీరామాయణమందున నారణ్యకాండమును యుద్ధకాండములోఁ గొంతభాగమును, మాత్రమురచించెను. తక్కినభాగములో బాల, కిష్కింధా, సుందరకాండములను దత్పుత్త్రుఁడగు మల్లికార్జునభట్టును, అయోధ్యాకాండమును శిష్యుఁడగు కుమారరుద్రదేవుఁడును, యుద్ధకాండములోని తుదిభాగమును నతనిమిత్త్రుఁడగు నయ్యలార్యుఁడును వ్రాసిరి. ఈముప్వురు, తామురచించినను మొదటఁ బ్రారంభించి కొంతవఱకుఁజేసిన యీహుళక్కిభాస్కరునె గ్రంథకర్తగానేర్పాటుఁజేసిరి. కాఁబట్టియె దానికి భాస్కరరామాయణమని పేరు వచ్చినది. ఈతనికవిత్వమతి పటువై యానందమునింపుచుండును.

ఈ 14వ శతాబ్దమందె భారద్వాజసగోత్రజుఁడును, నాపస్తంబసూత్రుఁడును, మారయ్యపుత్త్రుఁడును నగు శ్రీనాథుఁడు మహాకవియై మరుత్తరాజ చరిత్రము, పండితారాధ్యచరిత్రము, శాలివాహన సప్తశతి, నైషధము, భీమపురాణము కాశీఖండము, వీథినాటకము, హరవిలాసము, పల్నాటివీరచరిత్రమను ద్విపదకావ్యమును మున్నగు గ్రంథములను రచించి యాంధ్రభాషా పోషితుఁడాయెను. ఈకవికవిత్వము నిర్దుష్టమై సంస్కృతపద వ్యాప్తృతమై దీర్ఘసమాసములు కలదై యనేకాలంకారరమణీయమై రమ్యముగానుండును.

ఈకవికిసమకాలికుఁడును, బావమఱఁదియునగు బమ్మెర పోతన కౌండిన్యగోత్రజ కేతనపుత్త్రుఁడై మహాకవియై యుండెను. ఈకవి సంస్కృతభాగవతమును దెనిఁగించెను. ఈతనికవనము శబ్దాలంకార విరాజితమై పదలాలిత్యము కలదియై భక్తిరస ప్రధానమై యొప్పుచుండును. ఇతఁడు భగవంతునియందవ్యాజ భక్తి కలవాఁడు. ఈకవి వీరభద్రవిజయమను మఱియొక గ్రంథమును రచించెను. ఈకవి తానురచించినగ్రంథమును శ్రీరామస్వామికంకితముఁ జేసెను. ఈభాగవతమునఁగారణాంతరమునఁ గొన్నిభాగములుత్పన్నములై పోయెను. ఆభాగములను గంగన, సింగన, నారయ, యనువారలు పూరితిఁ జేసిరి. ఈభాగవత గ్రంథము నందక్కడక్కడ రేఫశకటరేఫములకుఁ బ్రాసాదులు చెల్లించుటవలనఁ బూర్వలాక్షణికులు దీనిని లక్షణగ్రంథముగాఁ బరిగణించనైరి.

ఇతనికిఁ దరువాత 15వ శతాబ్దమందున చొక్కన కుమారుఁడును, నియోగిబ్రాహ్మణుఁడును నగునల్లసాని పెద్దన శ్రీకృష్ణదేవరాయాస్థాన ప్రధానపండితుఁడై హరికథాసారము, స్వారోచిషమను చరిత్రములను రచించెను. ఈకవి రచించినవానిలోనికి మనుచరిత మె మిక్కిలివన్నె కెక్కినది. ఈతనికిఁబూర్వముం దున్నకవులు సంస్కృతకోశముల నాంధ్రీకరించుటయె కాని విపులీకరణముగా నొక గ్రంథమైననురచించియుండ లేదు. కాని యితఁడు మార్కండేయ పురాణమునందలి కథను గైకొనిపెంచి మనుచరిత్రప్రబంధమును రచించెను. కాఁబట్టియె యాంధ్రకవితాపితామహుఁడను బిరుదమునందెను. ఈకవి కవనము శ్రోత్రపేయమై శృంగారాది రససమన్వితమై యుండును.

ఇతనికి సమకాలికుఁడగు పింగళిసూరన యుభయభాషాకోవిదచూడామణియై రాఘవపాండవీయమును, కళాపూర్ణోదయమును, గరుడపురాణమును, ప్రభావతీ ప్రద్యుమ్నమునింకనుగొన్ని గ్రంథముల రచించెను. ఈతనిరాఘవపాండవీయము శ్లేషకావ్యమైనను క్లిష్టాన్వయములు లేక సులభశైలిలో బహుసరసముగా నుండును.

ఈకవికించుమించు సమకాలికుఁడగు రామరాజభూషణుఁడు వసుచరిత్రయను శ్లేషకావ్యమును మనుచరిత్ర ననుకరించి తిరుమలదేవరాయలను కృతినాయకునిగా నొనరించి రచించెను. ఈతనికవన మర్థగాంభీర్యము కలదియై యమకా

ప్యాలంకారభూషితమైకల్పనాచమత్కారము కలదియై యొప్పు చుండును.

ఇతనితరువాత 17వ శతాబ్దమందున గంగనసూతుఁడును, నియోగిబ్రాహ్మణుఁడును నగుకూచిమంచి తిమ్మకవి రాజశేఖరచరిత్రమును, కలభల్లాణచరిత్రము, రుక్మిణీపరిణయము సింహాచలమాహాత్మ్యంబును, సర్వలక్షణ సారసంగ్రహంబును, *నీలాసుందరీ పరిణయము,* అచ్చతెనుఁగు రామాయణము,(*ఈ రెండును శుద్ధాంధ్రములు) సారంగధరచరిత్రము, సాగర సంగమాహాత్మ్యంబును, సర్పపురమాహాత్మ్యంబును, రసికజనమనోభిరామమును శివలీలావిలాసము మొదలగు గ్రంథములను రచించెను. అంతఁదానభినవవాగనుశాసనుఁడని బిరుదమునందెను. ఉభయభాషలయందీతనికవనము మృదుమధురశైలిలోనుండి వినువారికిని, జదువువారికిని నానందముఁ గూర్చుచుండును.

ఇతనితరువాత 18వ శతాబ్దమందున్న నృసింహాచార్యతనూభవుండును, నైధ్రువకాశ్యపాన్వయుండును నగు మండభూషి వేంకటాచార్యులు సంస్కృతాంధ్రభాషలయంద సమానపండితుఁడై నూజివీడుసంస్థాన పండితుఁడుగా బహుకాలముండెను. ఈతఁడు శతావధానాష్టావధానవిధానములందుఁగడునేర్పరి. ఇతఁడు నాలుగాశ్వాసములుగల భరతాభ్యుదయకావ్యమొకటి రచించెను. ఈతనికవనము సలక్షణమై

మనోజ్ఞముగానుండెను. ఈతఁడభినవ "పండితరాయ"యని బిరుదమునంది యున్నవాఁడు.

ఇతనితరువాత వైదికబ్రాహ్మణుఁడును, లక్ష్మీపురగ్రామవాసియునగు గోపీనాథము వేంకటకవి వేంకటగిరిసంస్థానమందాస్థానకవి వరుఁడై వాల్మీకి రచితరామాయణమును, మాఘకవికృత శిశుపాలవధ మహాకావ్యంబును, బ్రహ్మకైవర్తపురాణస్థ కృష్ణజన్మఖండమును, భగవద్గీతను నాంధ్రీకరించెను. అంతట నాసంస్థానాధీశు లీతనికవనమునకు మెచ్చి యగ్రహారమొసంగిరి. ఈతనికవనము పండితపామరబోధకంబగు మనోహరశైలి కలదై లలితముగా నుండును.

ఈ తెలుఁగు బాసయందు సుప్రసిద్ధకవులింకను చాల మంది కలరు. కానిగ్రంథవిస్తరభీతిచే వారినివిడిచిపెట్టి వ్రాసితిని.

మనపూర్వకవులకుఁ బద్యకవనమందున్నంత ప్రేమ గద్యకవనమందుఁ గన్పడదు. కాని యిటీవలబాలవ్యాకరణప్రణేతయగు పరవస్తుచిన్నయసూరి మనోహరశైలిని వచనరచనఁజేసెను. ఈతనినీతిచంద్రిక కడుసొగసుగా నుండును. ఇతనిబాలవ్యాకరణమాధునికకవులకుఁ గొందఱ కుపకారమొనర్చుచున్నది. ఈచిన్నయసూరిని వచనరచన చతురుఁడని పలుకనగు.

ఇటుల హృద్యంబగునీ తెనుఁగుబాసను మనమెక్కువగా గౌరవించవలెను. మనమాతృభాష యెప్పుడభివృద్ధిబొం

దునోయప్పుడె మనమభివృద్ధికిరాఁగలము. రాజకీయభాషల మనమభ్యసించు చుండినను మనభాషవిడనాడక యభిమానముగా దానియందుండవలెను. దానిని బూజించుట మనతల్లినిఁబూజించుటయె యనినమ్ముఁడు. మనము మొదట తెలుఁగు పండితులను గౌరవించవలెను. వారిచే గ్రంథములఁ జేయించవలెను. అటుల మనబాసనభివృద్ధిఁజేయ సమకట్టిన మనముఁ గూడ విద్వాంసులము కాఁగలము. అంతట గ్రంథములరచించి కీర్తివంతులము కాఁగలము.

ఇటులవృద్ధిఁజేసి కీర్తిఁజెందిన వారలలో నొకనిని జెప్పెద.

క్రీ. శ. 11 వ శతాబ్దమున రాజరాజనరేంద్రుని వేఁడికోలుమీఁద నన్నయచే సృజింపఁబడిన యాంధ్రకవితను 15 వ శతాబ్దమందున్న కృష్ణదేవరాయలుచేకొని తన యాస్థానమందున్న కవులచేఁ బోషణఁజేయించుచు రమారమి నూటికంటె నధికముగా గ్రంథములరచింపఁజేసి యా గ్రంథకర్తలను సత్కరించుచుండెను. అటుపై నా శ్రీకృష్ణదేవరాయలు విద్వాంసుఁడై యాముక్తమాల్యదయను గ్రంథరాజమును రచించెను. తదుపరి కీర్తనీయుఁడాయెను.

చూచితిరా? ఆకృష్ణదేవరాయలు తాను మహారాజునని యీతెలుఁగుబాసను నిర్లక్ష్యముచేయక చేరఁదీసి యాంధ్రపండితుల నెక్కువగా గౌరవించుచుండెను. అందువలననె కదా యనర్ఘంబులగు నూఱుగ్రంథములు బయలు

వెడలినవి. దానవేకదా తెలుఁగుబాసకదియె వర్ధమానదశ యని వాకొనుచుండిరి. మఱియు నామహారాజాముక్తమాల్యదయను గ్రంథరత్నమునురచించి బైలుదేఱదీయుటవలనే కదా యితరులకుఁగూడ నాంధ్రగ్రంథములం దభిరుచికల్గుచున్నది. ఇటులనేకవిధములఁ దెలుఁగునభివృద్ధిఁజేయుటవలననేకదా యాకృష్ణదేవరాయలను గీర్తించుచున్నారు. కాన మనమందఱము మనమాతృభాషయగు తెలుఁగునందభిమానముకలిగి యుండవలెను. మనమాంధ్రమును జక్కఁగాఁ జదివి విద్వాంసులముకావలయును. అటుతరువాత నిస్సారమగు గ్రామ్యభాషను గ్రంథములరచించక హృదయంగమమగు గ్రాంథికభాషయందె మంచికబ్బముల రచించి యాంధ్రలోకసన్నుతికిఁ బాత్రులమగుటకుఁ బ్రయత్నింతము.

క. ఆయాదేశమువారికి
నాయాదేశంబుభాషనమరినకావ్యం
బాయతవుపుపార్థంబులఁ
బాయక సమకూర్చు దేవభాషయుఁ బోలెన్.

(అప్పకవీయము.)

ఓం తత్సత్

శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రి ప్రణీతంబగు
బాలనీతియను గ్రంథము సమాప్తము.
శ్రీ. శ్రీ. శ్రీ.